# శత్రు సంహారం!


































గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.

# WANTED

దేశమునందలి ఆర్థిక పరిస్థితులను పెంపొందించుటకు, నిరుద్యోగ సమస్య నివారించుటకు ఈ క్రింది ఉద్యోగములు చేయుటకు Agro Sales Representative, Depot Asst. Agro Clerks, Village Development. Officers Beekeeping Maistry, Compost Inspectors Sugar Cane Inspectors, Sugar Cane Asst. Field Man, Field Maistry, Garden Supervisors, Agri Teachers, Agri Asst. Demonstrators మొదలయిన ఉద్యోగములకు శిక్షణ ఇవ్వబడుచున్నది. శిక్షణాకాలము మూడు మాసములు. విద్యార్హత VIII Pass S.S.C., S.S.L.C., B.A., B.Com., B.Sc. / Pass or Failed అయి ఉండవచ్చును. అభ్యర్థులు తెలుగు, మలయాళం, కన్నడ, ఉర్దూ, తమిళం ఏదైనా ఒక మాతృభాష అయి ఉండవలయును. వయస్సు 1951వ సం॥ము నుండి 1964 సం॥ లోపల జన్మించిన పురుషులు లేక స్త్రీలు అర్హులు. ఎన్నికైన అభ్యర్థులకు ST వారికి SC వారికి 150 రూ. చొ॥న BC వారికి 130 రూ॥ చొ॥న మిగతా వారికి 120 రూ. చొ॥న ఉపకార వేతనం ఇవ్వబడును. దూర ప్రాంతముల నుండి వచ్చు విద్యార్థులకు, స్త్రీ, పురుషులకు ప్రత్యేక వసతి గృహములు ఇవ్వబడును. భోజన వసతులు కూడ గలవు. విద్యార్థులకు కావలసిన పుస్తకములు, తదితర వస్తువులు మరియు విహారయాత్ర ఉచితముగా కల్పించబడును. ప్రభుత్వ పరీక్షయందు ఉత్తీర్ణులైన వారికి విద్యార్హతనుబట్టి పై ఉద్యోగములు నిర్ణయించబడును. 380 రూ॥ నుండి 450 రూ॥ జీతము పొందవచ్చును. శిక్షణ యందు చేరుటకు దరఖాస్తు ఫారము కోరువారు 30 రోజుల లోపల 2 రూ॥ M.O లేక (NOT CROSSED) పోస్టల్ ఆర్డర్ ద్వారా పంపి పొందవచ్చును.

*Principal*

**COLLEGE OF SOUTH INDIAN AGRICULTURAL TECHNICAL TRAINING CENTRE**

136, Bhaskar Colony, Virugambakkam MADRAS - 600 092




పిల్లల ఆనందానికి
బబుల్‌గమ్‌ల సోపానం.






007
బబుల్‌గమ్

ఒక
NP
ఉత్పాదన

Imageads-NP-5m




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''మనసులో మాట''] కు ఆధారం ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి రచన. ప్రపంచంలో అందరికీ ఏదో ఒక శక్తి అవసరం. కొన్ని దుష్టశక్తులనీ, కొన్ని మంచిశక్తులనీ లోకం అపోహపడుతుంది. నిజానికి మంచి చెడ్డలు శక్తివి కావు, దాన్ని ఉపయోగించే వాడివి. దుష్టుడి చేతిలోని శక్తి దుష్టశక్తి.

## అమరవాణి

ఇద మేవ హి పాండిత్యం, ఇయ మేవ విదర్ధతా
అయ మేవ పరో ధర్మః, యత ఆయా న్నాధికో వ్యయః.

[ఆదాయాన్ని మించి ఖర్చు చెయ్యకపోవటం—అదే పాండిత్యం; అదే నేర్పరితనం; అదే ముఖ్యకర్తవ్యం!]

సంపుటి 66 ఏప్రిల్ '80 సంచిక 4

విడి ప్రతి : 1-50 :: సంవత్సర చందా : 18-00




శ్రీకంఠం మాధవరావు, అల్లీపురం

ప్ర : పిడుగు అనేది ఎందువలన పడుతుంది? దాని ఆకార మెట్లుంటుంది? అది ఎంత పరిమాణములో ఉంటుంది?

న : "పిడుగు" అనేదాన్ని గురించి అన్ని దేశాలలోనూ అపోహలుండేవి. ఇంద్రుడు వజ్రాయుధంతో కొడతాడనీ, అది భూమి మీద విధ్వంసం కలిగిస్తుందనీ మనవాళ్ళు నమ్మేవారు. ఆ పిడుగుకూ, మెరుపులకూ, ఉరుములకూ ఏదో సంబంధం ఉందని ప్రజల నమ్మకం. ఉరిమితే, పిడుగు తమ మీద పడకుండా అర్జునుడి పేర్లు గల శ్లోకాన్ని ఇప్పటికీ కొందరు చదువుతారు. అర్జునుడు ఇంద్రుడి కొడుకు గదా, అతను ఇంద్రుడి పిడుగు నుంచి మనని కాపాడగలడని. ఇందుకొక కట్టుకథ కూడా చెబుతారు. పాండవులు ఏకచక్రపురంలో బ్రాహ్మణ బాలకులమని చెప్పుకుంటూ భిక్షాటన చేస్తూంటే ఒక పిడుగు పడిందట; అర్జునుడు దాన్ని తన జోలెలో పట్టుకుని, ఎవరికీ అపాయం కలగకుండా చేశాడు!

ఈనాడు మనకు తెలిసినదేమంటే, ఉరుములకూ, మెరుపులకూ సంబంధించిన "పిడుగు" అన్న పదార్థం ఏమీ లేదు. మెరుపు మేఘాల మధ్య ఏర్పడితే అది హానిచెయ్యదు. మెరుపు అన్నది శక్తివంతమైన విద్యుత్ప్రసారం. అది భూమికీ, మేఘానికీ మధ్య జరిగితే చాలా నష్టం–ప్రాణనష్టం సైతం–జరుగుతుంది. ఈ విద్యుత్పాతం నిరపాయంగా ఉండగలందులకు ఎత్తయిన భవనాల మీద "లైట్నింగ్ కండక్టర్స్" (విద్యుద్వాహకాలు) ఏర్పాటు చేస్తారు. సాధారణంగా విద్యుద్ఘాతం ఎత్తయిన ఇళ్ళ మీదా, చెట్ల మీదా జరుగుతుంది.

అలా అయితే అర్జునుడి జోలెలో పడిన పిడుగు ఉత్త కల్పనేనా? కాదు. మనం రాలుడు నక్షత్రాలుగా రాత్రిపూట నిర్మలాకాశంలో చూసేవి చాలావరకు గాలిలోనే బూడిద అయిపోయే ఉల్కలు. అయితే వాటిలో కొన్ని పెద్దవిగా ఉండి, గాలి ఒరిపిడికి పూర్తిగా దహనంకాక నేల మీద పడతాయి. వీటిలో హెచ్చుగా ఇనుమూ, బొగ్గూ ఉంటుంది. వీటి ప్రమాణం కొద్ది గ్రాముల నుంచి కొన్ని టన్నుల వరకూ ఉండవచ్చు ప్రపంచంలో అక్కడక్కడా "క్రేటర్" సరస్సులు ఉన్నాయి. అవి అనేక టన్నుల బరువు గల ఉల్కల పతనం వల్ల ఏర్పడినవే. ఆకస్మిక దుర్వార్తను ఇంగ్లీషులో "బోల్ట్ ఫ్రమ్ ది బ్లూ" (నిర్మలాకాశం నుంచి పిడుగు) అంటారు. ఆ పిడుగు ఉల్క!




## 82

అతిలోభి అత్యంతలోభితో, ''విధి అనుకూలించిన కారణంగా అనర్హులు సైతం లాభం పొందేమాట నిజమే. కాని మనిషి దాన్ని నమ్ముకుని, దురాశకు లోనుకావటంవల్ల విధి వక్రించవచ్చు. అప్పుడు నీకు కలిగినట్టుగా తీరని దుఃఖం సంప్రాప్తమవుతుంది. నిన్ను చూసి నేను మనస్ఫూర్తిగా జాలి చెందుతున్నాను. ఇక నేను, యీ ప్రాంతం నుంచి ఇంటికి తిరిగి వెళ్ళాలి. అందుచేత నాకు సెలవు ఇయ్యి.'' అన్నాడు.

దానికి అత్యంతలోభి, ''మిత్రమా, దుర్దశ కలిగినప్పుడు మిత్రులూ, ధనమూ సహాయపడతాయంటారు. మరి నన్ను ఈ స్థితిలో వదిలి ఎందుకు పోతానంటు న్నావు? ఆపదలో ఉన్న స్నేహితుణ్ణి నిర్ద యగా విడిచిపెట్టేవాడు కృతఘ్నుడనీ, నరకానికి పోతాడనీ అంటారు గద!'' అన్నాడు.

''మిత్రుడి కష్టాన్ని తీర్చగల స్థితిలో ఉన్నవాడి విషయంలోనే ఆ మాట వర్తిస్తుంది. నీ కష్టాన్ని మానవమాత్రుడెవరూ తీర్చలేడు. నీకు విముక్తి కలిగించే శక్తి నాకు కాదుగదా మరెవరికి కూడా లేదు. నేను నీ దగ్గిరే ఉండటంచేత నీకు చిన్న మెత్తు మేలు కలగకపోగా, నీ బాధ చూస్తూ నేను కూడా బాధ పెంచుకోవలసి వస్తుంది. నీ ముఖంలోని బాధ చూస్తూంటే నాకు కూడా ఇలాటి దుస్థితే కలుగు తుందేమోనని భయం పుట్టుకొస్తున్నది. అందుచేత, దయ ఉంచి నన్ను త్వరగా వెళ్ళిపోనీ,'' అన్నాడు అతిలోభి.

అత్యంతలోభి, ''సరే, ఇంటికి పోయి, సుఖంగా ఉండు. నా ప్రారబ్ధం గురించి



ఎవరూ దాని మాట వినిపించుకోకుండా, తమ దారిన తాము వెళ్ళారు.

చివరకు ఒక దురాశాపరుడు తనలో, "నా అదృష్టం! అయినా ఇందులో కించిత్తు ప్రమాదం లేకపోలేదు. అందుచేత జాగరూకత అవసరం! కోరదగినదైనా కోరదగనిచోట లభించటంలో అపాయం ఉన్నది. విషంతో కూడిన అమృతం కూడా ప్రాణం తీస్తుంది గదా! కాని ఆ మాటకు వస్తే, అంతో ఇంతో అపాయం లేకుండా ధనం ఎలా వస్తుంది? కొంత సాహసం లేనిదే ఎవరూ ధనికులు కాలేరు. ఈ బహుమతియొక్క లోతుపాతులు క్షుణ్ణంగా విచారింతాం," అనుకుని, పులితో, "కంకణం ఏదీ?" అన్నాడు.

పులి తన పంజా ముందుకు చాచి, సువర్ణకంకణాన్ని చూపుతూ, "ఇదుగో!" అన్నది.

"నీ వంటి క్రూర ప్రాణిని నమ్మట మెలాగ?" అని పాంథుడు ముసలి పులిని అడిగాడు.

"అయ్యా, నా కథ వింటే నీకే నమ్మకం కలుగుతుంది. యౌవనంలో నేను చాలా పాపిష్ఠిని. నేను ఎంతమంది మనుషులనూ, ఎన్ని పశువులనూ చంపానో లెక్క లేదు. దాని ఫలితంగా నా భార్యా,

నా వాళ్ళకు అందరికీ తెలియపరచు," అన్నాడు.

అతిలోభి ఆ పర్వతప్రాంతాన్ని విడిచిపెట్టి, మళ్ళీ మనుష్యప్రపంచంలో వచ్చి పడ్డాడు.

### ముసలి పులి కథ

దక్షిణారణ్యాలలో ఒక ముసలి పులి ఉండేది. ఒక రోజు అది ఒక మడుగులో స్నానం చేసి, ఒక చేతితో దర్భలూ, రెండో చేతితో సువర్ణ కంకణమూ పట్టుకుని కూర్చుని, దారే పోయే వారితో, "ఓ పాంథులారా! కొంచెం ఆగండి! ఈ కంకణాన్ని బహుమతిగా పుచ్చుకోండి," అనసాగింది.

బిడ్డలూ చచ్చి, నేను మాత్రమే మిగిలాను. అప్పుడొక సాధువు నన్ను దానధర్మాలూ, పుణ్యకార్యాలూ చెయ్యమన్నాడు. ఆ ప్రకారమే నేనిప్పుడు రోజూ స్నానం చేసి, దానాలిస్తున్నాను. నాకు వృద్ధాప్యం వచ్చేసింది. కోరలూ, గోళ్ళూ తమ శక్తి కోల్పోయాయి. నన్ను నువు అనుమానించవలసిన పని ఏమిటి? యజ్ఞమూ, వేదాధ్యయనమూ, దానమూ, తపస్సూ, సత్యవ్రతమూ, క్షమా, ఓరిమీ, లోభరాహిత్యమూ అనే ఎనిమిది మార్గాల పుణ్యం కలుగుతుందని పురాణాలు చెబుతున్నాయి. ఇందులో మొదటి నాలుగూ ఆడంబరం కావచ్చు, కాని చివరి నాలుగూ మహాత్ములకు మాత్రమే సాధ్యం. నేను నిస్వార్థిని కనకనే అడిగిన వారికి ఈ సువర్ణకంకణం ఇచ్చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. అయితే, పులి అవకాశం దొరికితే మనిషిని తినకుండా ఉండదన్న అపవాదు ఒకంతటపోదు. నేను ధర్మశాస్త్రాలన్నీ చదివాను. పేదవాడికి ఇచ్చిన దానం ఎడారిలో వర్షంలాటిది; ఆకలిగొన్నవాడికి ఆహారం లాటిది! అందరికీ ప్రాణం అంటే తీపే! సజ్జనులు అందరినీ తమలాగే చూసుకుంటారు. ఏది విసర్జించాలి, ఏది స్వీకరించాలి, ఏది మంచిది, ఏది చెడ్డది అన్న సంగతి మనిషికి తన అనుభవంనుంచే తెలుస్తుంది. నువు చాలా పేదవాడివి. నేను నీకు ఈ విలువగల కంకణం ఇయ్యగోరు



తున్నాను. ధనాన్ని నిర్ధనులకు ఇయ్యాలి గాని, ధనవంతులకు ఇయ్యరాదు. ఔషధం రోగికిగానీ, ఆరోగ్యవంతుడికి కాదు గదా! అందులోనూ ప్రతిఫలాపేక్ష లేకుండా చేసే దానం ఉత్తమోత్తమమని మహర్షులు చెప్పారు. కనక, మడుగులో స్నానం చేసి యీ సువర్ణదానం పుచ్చుకో," అన్నది పులి.

పాంథుడు పులి మాటలు నమ్మి, కంకణం తీసుకోవాలన్న దురాశతో, స్నానం చెయ్యటానికి నీటిలోకి దిగాడు. దిగిన మరుక్షణం అతను మొలబంటి బురదలో కూరుకుపోయి, కదలలేక పోయాడు.

వాడు ఊబిలో కూరుకుపోవటం చూసి పులి, "అయ్యో, ఊబిలో చిక్కుపడ్డావా? భయపడకు. నేను నిన్ను బయటికి లాగుతాను ఉండు," అంటూ తాపీగా వాణ్ణి సమీపించింది.

దాన్ని చూసి పాంథుడు, "ధర్మ శాస్త్రాలూ, వేదాలూ చదివిన మాత్రాన దుర్మార్గుణ్ణి నమ్మరాదు. ఏ మేత మేసినా ఆవుపాలు తియ్యగానే ఉండే తీరుగా, క్రియకు అంతస్స్వభావమే గణనకు వస్తుంది. ఇంద్రియాలూ, బుద్ధీ అదుపులో లేనివాడి చర్యలు ఏనుగు స్నానంలాగా నిరుపయోగమైనవి. ఆచరణ లేకుండా శుష్కోపదేశాలు చెయ్యటం అనాకారిది ధరించిన ఆభరణాలలాగా బరువు చేటు! ఈ ఘాతుకమృగాన్ని నమ్మి నేను పొరపాటు పడ్డాను. నదులనూ, ఆయుధాలు ధరించిన వారినీ, కొమ్ములూ, గోళ్ళూ కల వాటినీ, స్త్రీలనూ, రాజులనూ నమ్మరాదు. చిట్టచివరకు వ్యక్తమయేది అంతస్స్వభావమే! ఆకాశంలో సంచరిస్తూ, అంధకారాన్నీ, పాపాలనూ తొలగించుతూ, సహస్రకిరణాలతో చుక్కల మధ్యగా తిరిగే చంద్రుణ్ణి సైతం విధివశాన రాహువు మింగేస్తూ ఉంటాడు. నుదిటి వ్రాత తప్పించుకోవటం ఎవరితరం?" అనుకుంటూ ఉండగా పులి వచ్చి అతన్ని చంపి తినేసింది.






## 22

[సామంతు సూర్యభూపతి, తన కోట రక్షణకై వెళ్ళాడు. మర్కటుడు కూడా కోటగోడ దూకి పారిపోయాడు. భల్లూకమాంత్రికుడు తన గురువు ఆపదలో వున్నాడని సారంగమార్గం ప్రవేశిస్తూండగా, తలారి భల్లూకుడు అతణ్ణి ఆటకాయించాడు. మాంత్రికుడు అతణ్ణి నగరతలారి వంటూ మంత్రదండంతో తల మీద కొట్టి, సారంగంలోకి వెళ్ళాడు. తరవాత—]

భల్లూక మాంత్రికుడు వెళ్ళిపోగానే, రాజు జితకేతుడు, కాళీవర్మ కేసి చూసి, ''ఇప్పుడు మనం ఏం చేయటం బావుంటుంది? మీ అందరి సమక్షంలో సామంతు సూర్యభూపతి కుమార్తె, నా దత్తురాలని చెప్పాను. ఆమెను, మర్కటుడి గురువైన మిథ్యామిశ్రుడి నుంచి రక్షించవలసి వున్నది గదా? సైనికులను వెంట తీసుకుని అరణ్యానికి వెళదామా?" అన్నాడు.

''మహారాజా, వెంట సైనికులతో కోలాహలంగా అరణ్యం ప్రవేశించటమంటే, ఆ తాంత్రికుణ్ణి ముందుగానే హెచ్చరించటం అవుతుంది,'' అని, కాళీవర్మ అక్కడి నుంచి కదిలాడు.

కాళీవర్మ వెనకగా, రాక్షసుడు ఉగ్రదండుడూ, నగర తలారీ బయలుదేరారు. అప్పటివరకూ అంతా చూస్తూ నిలబడిన బైరాగిగురువూ. అతడి శిష్యులూ సారంగ



మార్గాన్ని జితకేతరాజుకు చూపుతూ, "మహారాజా! మేము చెరువుగట్టున, మర్రిచెట్టు సమీపానవున్న యీ సొరంగ ముఖద్వారానికి కాపలావుంటాం, సెలవు!" అంటూ సొరంగలో దిగారు.

ఈసారి కాలినడకన కాళీవర్మా, తలారీ, రాక్షసుడూ అరణ్యం ప్రవేశించే సరికి, వాళ్ళకు ఒకచోట పెద్ద ఎలుగు బంటు ఒకటి కనిపించింది. అది కొన్ని దుంపలనూ, పళ్ళనూ అడవితీగలతో కట్టి భుజానవేసుకుని, వేగంగా నడుస్తున్నది.

కాళీవర్మ అశ్చర్యపోతూ, "ఉగ్ర దండా! ఏమిటీ వింత?" అన్నాడు.

"ఇందులో వింత పడేందుకేమున్నది? ఈ ఎలుగుబంటు దుర్మార్గుడైన ఆ తాంత్రికమిశ్రుడి పెంపుడు జంతువై వుంటుంది. మనం చడీచప్పుడూ కాకుండా దీన్ని అనుసరించిపోతే, వాడెక్కడ వున్నదీ తెలుసుకోవచ్చు." అన్నాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

ముగ్గురూ ఎలుగుబంటి వెనకగా కొంత దూరం వెళ్ళేసరికి, ఒక చెట్టు కింద భల్లూకమాంత్రికుడూ, తెల్లని గడ్డంతో, బక్కచిక్కన శరీరంతో, మెడలో రుద్రాక్ష మాలలతో ఒక వృద్ధుడూ వాళ్ళ కంట బడ్డారు. సామంతు సూర్యభూపతి వాళ్ళతో ఏదో మాట్లాడుతున్నాడు.

కాళీవర్మను అంతదూరాన చూస్తూనే భల్లూకమాంత్రికుడు లేచి నిలబడి, "శిష్యా కాళీ!" అంటూ పెద్దగా కేకపెట్టి, "ఇదుగో, నా గురువు భల్లూకపాదుడు, యిక్కడే వున్నారు! సూర్యభూపతి కుమార్తె అయిన కాంచనలతను తాంత్రికమిథ్యామిశ్రుడు కోటలో నుంచి అపహరించుకుపోయాడు. ఇప్పుడేం చేయబోతున్నావు?" అన్నాడు.

ఎలుగుబంటును గండ్రగొడ్డలితో కొట్టేందుకు పొంచి నడుస్తున్న నగర తలారి చప్పున గొడ్డలిని భుజాన పెట్టుకుని, "ఈ జంతువు భల్లూకపాదుడి పెంపుడి దన్నమాట! బతికిపోయింది," అన్నాడు.

భల్లూకమాంత్రికుడు వాళ్ళ దగ్గిరకు వచ్చి, "నా గురువుగారి పెంపుడు ఎలుగు మిమ్మల్నిక్కడికి తెచ్చిందన్న మాట! ఆ తాంత్రికుడు నా గురువును, భల్లూకేశ్వరి ఆలయం ముందు ఒక చెట్టుకు కట్టి, నిరాహారిని చేసి చంపాలని చూశాడు. కాని, వాడు యీ ప్రాంతాలకు బయలు దేరగానే, స్వామిభక్తి గల ఎలుగుబంటు ఆయనకట్లువిప్పి, కాపాడింది," అన్నాడు.

ఉగ్రదండుడు ముసలి భల్లూకపాదుడి కేసి కోపంగా చూస్తూ, "నా అన్న కాలదండుడెక్కడ?" అని అడిగాడు.



భల్లూకపాదుడు మెడలోని రుద్రాక్ష మాల కేసి ఒకసారి చూసుకుని, చిరునవ్వు నవ్వి, "ఈ ప్రశ్న అడగవలసింది నన్ను కాదు, తాంత్రిక మిథ్యామిశ్రుణ్ణి! వాడు మందుమాకులతో నీ అన్నను మూగ వాణ్ణి చేసి, నేనీ ఎలుగుబంటును వాహనంగా వాడుకుంటున్నట్టు, వాడుకుంటున్నాడు. వాణ్ణి యీ అరణ్యంలో వెతికి పట్టగలిగితే, అక్కడ నీ అన్న కాలదండుడితోపాటు, రాజకుమార్తె కాంచనలత కూడా దొరుకుతుంది. మీలో అంత సాహసికులెవరు?" అన్నాడు.

కాళీవర్మ కత్తిపిడి మీద చేయివేసి, "ఆ సాహసం ఏదో నేనే చేసి, ఆ కాంచనలతను రక్షించటమేకాదు, ఆ తరవాత ఆ తాంత్రికుణ్ణీ, నిన్నూ, నా కత్తికి బలి చేస్తాను. మంత్రతంత్రాలు నేర్చిన దుష్టులెవరూ, యీ ప్రాంతాల ప్రాణాలతో వుండటానికి వీలులేదు," అన్నాడు.

ఆ మాటలకు భల్లూకమాంత్రికుడు పళ్ళుకొరుకుతూ, మంత్రదండం పైకెత్తబోయేంతలో, సామంతు సూర్యభూపతి అతణ్ణి వారించి, "కాళీవర్మా, ఈ భల్లూకపాదుడూ, యీయన శిష్యుడైన భల్లూకమాంత్రికుడూ మనకు శత్రువులు కాదు. శంఖం ఊదుతూ, మాయామర్కటుణ్ణి గురువైన తాంత్రికుడి దగ్గిరకు రావలసిందిగా హెచ్చరిస్తున్న, వాళ్ళ సేవకుణ్ణి పట్టుకునేందుకు, యింతకుముందే నాకు



నువ్వు మనకు కావలసిన జాతకుణ్ణే పట్టావు. కాని, పరిస్థితులు అనుకూలించక మన చేజారిపోయాడు. ఇప్పుడు మనం ఆ తాంత్రికుణ్ణి హతమార్చటంతో తృప్తి పడదాం. ఇక కదలండి!'' అన్నాడు.

ఆ వెంటనే ఎలుగుబంటును ఎక్కి భల్లూకపాదుడూ, అతడి శిష్యుడు భల్లూక మాంత్రికుడూ ఒకపక్కగానూ; రాక్షసుడు ఉగ్రదండుడూ, తలారీ, సామంతు సూర్య భూపతీ ఘరొకపక్కగానూ అరణ్యంలోకి బయలుదేరారు.

కాళీవర్మ దారివెంట అడుగుల గుర్తు కోసం వెతుకుతూపోగా, ఒకచోట అతడికి మామూలుమనుషుల అడుగుల గుర్తులతో పాటు, అంతకు రెండు, మూడింతలున్న అడుగుల గుర్తులు కనిపించినై. వెంటనే అతడికి తాంత్రికుడి వెంటవున్న ఉగ్రదండుడి అన్న అయిన కాలదండ రాక్షసుడు గుర్తుకు వచ్చాడు.

ఆ దాపులలో ఎక్కడో తాంత్రికుడు స్థావరం ఏర్పరచుకుని వుంటాడను కుంటూ కాళీవర్మ పొదలచాటుగా నడుస్తూ మరికొంతదూరం పోయేసరికి, అతడికి ఒక పెద్దకొలనూ, అందులో వచ్చి పడు తున్న ఒక సెలయేరూ కంటబడినై. ఆ సెలయేటి ఒడ్డున పొడవాటి త్రిశూలం ఒకటి నేలలో గుచ్చబడి వుండటం

చాలా సాయంచేశారు. ఇదుగో, ఆ శంఖం! వాణ్ణి, ఎంత హింసపెట్టినా తన యజమాని, ఎక్కడ వున్నదీ చెప్పలేదు. ఆ దుష్టుణ్ణి నా కత్తికి బలిచేశాను,'' అన్నాడు.

కాళీవర్మ శంఖాన్ని దూరంగా విసిరి వేసి, ''రాజా సూర్యభూపతీ! నువ్వు నిజంగా బలిపెట్టవలసింది, నీ కుమార్తెను అపహరించుకుపోయిన తాంత్రిక మిథ్యా మిశ్రుణ్ణి, వాడి సేవకుణ్ణి కాదు. సరే, మనం తలా ఒకవైపుకు పోయి, వాడి కోసం వెతుకుదాం, దొరక్కపోడు,'' అంటూ బయలుదేరాడు.

భల్లూకపాదుడు మెచ్చుకుంటున్నట్టు తలవూపి, భల్లూకమాంత్రికుడితో, "శిష్యా,

చూసి కాళీవర్మ ఆశ్చర్యపడుతూ మరి కాస్త ముందుకు వెళ్ళాడు. కొలనులో ఒక దృఢకాయుడు, నల్లని జులపాల జుట్టుతో, చిన్నగడ్డంతో అతడి కంట బడ్డాడు. వాడు కళ్ళుమూసుకుని, ఏదో మంత్రం జపిస్తున్నాడు.

వాడు మరెవరో కాదు, తాంత్రిక మిథ్యామిశ్రుడని కాళీవర్మ వెంటనే గ్రహించాడు. అతడు కోపంతో పళ్ళుకొరికి, వేగంగా కొలను ఒడ్డుకుపోయి, "ఒరే, నువ్వేగదా, తాంత్రిక మిథ్యామిశ్రుడివి? తాంత్రికుడికి మంత్రాలతో ఏం పని? నువ్వు అపహరించుకువచ్చిన సూర్యభూపతి కుమార్తె కాంచనలత ఎక్కడ?" అన్నాడు బిగ్గరగా.

మంత్రం జపిస్తున్నవాడు చప్పున కళ్లు తెరిచి, కాళీవర్మ కేసి పరీక్షగా ఓమారు చూసి, "చెప్పకుండానే, నా పేరు గ్రహించావు, నిశ్చయంగా తెలివైనవాడివే! నా శంఖం మోసే సేవకుణ్ణి, అరణ్యంలో యింతకుముందే ఎవరో చంపారని, నా శిష్యుడు భ్రాంతిమతి చెప్పాడు. ఆ చంపినవాడివి నువ్వు కాదుగదా?" అని అడిగాడు.

"ఆ సంగతి తరవాత చెపుతాను, కాంచనలతను ఎక్కడ దాచావు?" అంటూ కాళీవర్మ కత్తి దూయ



బోయేంతలో, పైనున్న చెట్లకొమ్మల్లో మాయామర్కటుడు కిచకిచ మంటూ అరిచి, "తాంత్రిక గురో! వీడే కాళీవర్మ, పుట్టుసాహసి! వేయిమాటలేల, ఈ క్షణానే వీడి ప్రాణాలు తీయటం మనకు క్షేమం!" అంటూ కొమ్మల్లోంచి కాళీవర్మ కేసి దూకుతున్నంతలో, కత్తి దూసే వ్యవధిలేక, కాళీవర్మ చప్పున పక్కనే వున్న త్రిశూలాన్ని, మర్కటుడి కేసి పైకెత్తాడు.

మాయామర్కటుడు ఆ సరికే కొమ్మ మీది నుంచి రివ్వున కిందికి వస్తూ, బలంగా త్రిశూలాన్ని తాకటంతో, కాళీవర్మ చేయి పట్టు తప్పి త్రిశూలం తిరిగి నేలలో గుచ్చుకుపోయింది. మర్కటుడు త్రిశూలం



మీద కొరతపడిపోయి, బాధతో కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ, "జై, తాంత్రిక గురో! తిరిగి తమకు సేవచేసే భాగ్యం ఆ పైలోకంలోనే!" అంటూ అరవసాగాడు.

కాళీవర్మ తాపీగా ఒర నుంచి కత్తి లాగి, కొలను నీటిలో నిశ్చేష్టుడై చూస్తున్న తాంత్రికుడితో, "ఒరే, తాంత్రికాధమా! నువు పూజించే భల్లూకేశ్వరి పేరు మీద, నిన్ని కొలను ఒడ్డునే నా కత్తికి బలిచేయబోతున్నాను. ముందు కాంచనలతను ఎక్కడదాచావో,చెప్పు," అన్నాడు.

అంతవరకూ నిశ్చేష్టుడైవున్న తాంత్రికుడు చిరునవ్వు నవ్వి, చేతులు చాచి, గుప్పెళ్ళు మూసి తెరుస్తూ, తలను అటూ యిటూ రకరకాలుగా తిప్పసాగాడు. ఆ వింతప్రవర్తనకు ఆశ్చర్యపోతూ, కాళీవర్మ కొలను నీటిలో దిగబోతున్నంతలో, వెనకవైపునుంచి, "యువకుడా, జాగ్రత్త! తాంత్రికుడు సైగచేస్తున్నది, మూగ రాక్షసుడికి!" అన్న స్త్రీ కంఠం వినిపించింది.

కాళీవర్మ చప్పున వెనుదిరిగాడు. రాక్షసుడు ఉగ్రదండుణ్ణి పోలినవాడొకడు భుజాల మీదినుంచి ఒక యువతిని కిందికి దించి, అడవి ఏనుగులా ఒకసారి ఘీంకరించి, రాతిగద పైకెత్తి వేగంగా కాళీవర్మకేసి వచ్చాడు. కాళీవర్మ మెరుపువేగంతో రాక్షసుడి దారి నుంచి పక్కకు తప్పుకున్నాడు. రాక్షసుడు కొలను ఒడ్డునున్న బురదలో కాలుజారి, నీటిలో బోర్లాపడిపోయాడు. వాడి చేతిలో వున్న రాతిగద ఒడ్డున పడిపోయింది.

రాక్షసుడు యీసారి మరింత పెద్దగా ఘీంకరించి, మోచేతులను నేలకు ఊతంగాపెట్టి లేవబోతున్నంతలో, కాళీవర్మ ఛెంగున ముందుకు దూకి, రాతిగద తీసుకుని, వాడి తలమీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు రాక్షసుడు భీకరంగా ఒక్క అరుపు అరిచి, ప్రాణం కడబట్టి, నీటి ఒడ్డున శవంలా పడిపోయాడు.

కాళీవర్మ, ఎటు పారిపోవటమా అని దిక్కులు చూస్తున్న తాంత్రిక మిథ్యా

మిశ్రుడి కేసి ఓమారు చూసి, రాక్షసుడు తెచ్చిన యువతితో, "నువ్వేగదా, సూర్య భూపతి కుమార్తె కాంచనలతవు?" అన్నాడు.

ఆ యువతి అవునన్నట్టు తల వూపి, "తాంత్రికుడి యిద్దరు సేవకులూ చచ్చి నట్టున్నది! వాణ్ణి ప్రాణాలతో వదలరాదు. నా దగ్గిర ఆయుధం లేదు. నీ కత్తి నాకు యిచ్చి, మూగరాక్షసుడి రాతిగద నువ్వు తీసుకో. ఈ దుర్మార్గుణ్ణి వేటాడదాం," అన్నది.

కాళీవర్మ ఆ మాటలకు పరమానందం చెంది, కత్తిని కాంచనలతకు యిచ్చి, రాతిగదను భుజానపెట్టుకుని, కొలనునీట దిగి, తాంత్రికుడి కేసి పోబోతున్నంతలో, రాజు జితకేతుడు యిద్దరు సైనికులతో అక్కడికి వచ్చి, "కాళీవర్మా, యిది మొసళ్ళకొలను. వెంటనే ఒడ్డుకురా! ఈ తాంత్రికుణ్ణి వేటాడేందుకు నా సైనికులూ, నగర తలారీ, రాక్షసుడు ఉగ్రదండుడూ వస్తున్నారు." అని ఆశ్చర్యపోతూ దిక్కులు చూస్తున్న కాంచనలతను సమీపించి, "అమ్మా, నువు నా దత్తుకుమార్తెవు! ఆ కారణంగా, నాకు నచ్చిన యువకుడికి, నిన్నిచ్చి వివాహం చేసే హక్కు నాకున్నది, అవునా?" అన్నాడు.



కాంచనలత సిగ్గుపడుతూ, తల దించుకునేంతలో అక్కడికి సామంతు సూర్యభూపతితో పాటు ఎలుగుబంటు మీద భల్లూకపాదుడూ, భల్లూకమాంత్రికుడూ, తలారీ, ఉగ్రదండుడూ వచ్చారు.

సూర్యభూపతి కన్నీళ్ళు పెడుతూ, తన కుమార్తెను సమీపించి. "అమ్మా, నిన్ను తిరిగి ప్రాణాలతో కళ్ళచూస్తాననుకోలేదు." అని కాళీవర్మతో, "కాళీవర్మా, నువ్వు మహావీరుడివి, సందేహం లేదు," అన్నాడు.

రాజు జితకేతుడు నవ్వుతూ, కాళీవర్మ చేయిపట్టుకుని, అతణ్ణి కాంచనలత దగ్గిరకు తీసుకువచ్చి, "నా దత్తు

కుమార్తె కాంచనలతకూ, యీ క్షత్రియ యువకుడు కాళీవర్మకూ, యిదే మీ అందరి సమక్షంలోనూ పాణిగ్రహణం చేస్తున్నాను. నా తదనంతరం యితడే చంద్రశిలానగరానికి రాజు!'' అన్నాడు.

అందరూ హర్షధ్వానాలు చేశారు. అంతలో కొలను నుంచి ఒక చావుకేక వినిపించింది. అందరూ అటు చూసేసరికి, ఒక పెద్ద మొసలితో తాంత్రిక మిథ్యామిశ్రుడు చావుబతుకుల పోరాటం చేస్తున్నాడు. అది చూసి భల్లూకమాంత్రికుడు ఉత్సాహంగా మంత్రదండాన్ని పైకెత్తి ఊపుతూ, ''భల్లూకపాదగురో! భల్లూకేశ్వరీదేవికి యిక మీరే ప్రధాన పూజారులు! మీ విరోధి మొసలికి ఆహారం అయిపోతున్నాడు,'' అన్నాడు.

అందరూ చూస్తూండగానే మొసలి, తాంత్రిక మిథ్యామిశ్రుణ్ణి నోటకరుచుకుని కొలను నీట మునిగిపోయింది. రాక్షసుడు ఉగ్రదండుడు, నీటి ఒడ్డుకు పోయి, ప్రాణం కడబట్టి పడివున్న కాలదండ రాక్షసుణ్ణి కూర్చోబెట్టి, ''అన్నా! ఇంతకాలంగా నిన్ను హింసపెట్టిన తాంత్రికుడు మొసలికి ఎర అయిపోయాడు, ఇక లే!" అంటూ వీపున గట్టిగా చరిచాడు.

రాక్షసుడు కాలదండుడు చప్పునలేచి నిలబడి, రెండు చేతులతో గొంతు గట్టిగా పట్టుకుని, కొలను కేసి చూస్తూ కీచుమంటూ అరిచి, ''తమ్ముడూ, ఉగ్రదండా, ఆ తాంత్రికుడు చచ్చాడా? వాడు తినిపించిన విషాలతో, వాడంటే పుట్టిన భయంతో, యింతకాలంగా నేను మూగవాణ్ణయిపోయాను. ఇంత రాక్షసుణ్ణయిన నన్ను ఎదిరించి, మూర్ఛపోగొట్టిన ఆ మహావీరు డెక్కడ?'' అంటూ పెద్ద అంగలు వేస్తూపోయి, కాళీవర్మనూ, పక్కనే నిలబడి వున్న కాంచనలతనూ ఎత్తి, భుజాల మీద కూర్చోబెట్టుకున్నాడు.

భల్లూకమాంత్రికుడితోపాటు అందరూ బ్రహ్మానందపడిపోతూ, హర్షధ్వానాలు చేశారు. — (అయిపోయింది)






# మనసులోమాట

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏదైనా అద్భుతశక్తి సాధించటానికిగాను దీక్షగా కృషి చేస్తూ ఉన్నట్టయితే, అందుకు నిన్ను అభినందించవలసిందే. ఎందుకంటే మానవులను సన్మార్గంలో ఉంచటానికి సామ, దాన, భేద, దండోపాయాలకన్న కూడా అద్భుతశక్తులు మరింత బాగా పని చేస్తాయి. ఇందుకు నిదర్శనంగా నీకు భీముడనేవాడు సాధించిన అద్భుతశక్తి గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

భీముడనేవాడు ఒక కాపు. తండ్రి అనంతరం అతను స్వయంగా వ్యవ

## బేతాళ కథలు





సాయంలోకి దిగి, తమ మామిడితోటను అనుకుని ఉన్న బంజరు దున్నసాగాడు. అకస్మాత్తుగా నాగలికి ఏదో అడ్డు తగిలింది. భీముడు పార తీసుకుని మట్టి తవ్వగా, నాగలికి అడ్డు వచ్చినది ఒక రాతి తొట్టె అని తెలిసింది. తొట్టె మీద ఒక రాతిపలక ఉన్నది. అది తీస్తే తొట్టె లోపల ఒక కుండ బోర్లించి ఉన్నది. ఆ కుండ కింద ఒక వింత హారమూ, ఒక తాళపత్ర గ్రంథమూ ఉన్నాయి.

భీముడు దున్నే పని కట్టిపెట్టి, గొయ్యి పూడ్చేసి, వాటిని తీసుకుని ఇంటికి వెళ్ళిపోయి, తాళపత్రాలు చదివితే అందులో ఆ హారం గురించిన వివరాలున్నాయి.

ఆ హారాన్ని ధరించిన వాడికి తన ఎదట ఉన్న మనిషి మనసులోని ఆలోచనలు తెలిసిపోతాయి. ఎన్నో వందల సంవత్సరాల క్రితం దయానిధి అనేవాడు ఈ హారాన్ని ఒక యోగి వద్ద సంపాదించాడు. దానికి గల శక్తి గురించి తెలుసుకున్నాక, దయానిధి దుర్మార్గానికి దిగాడు. అతను గొప్ప గొప్ప వాళ్ళవద్దకు ఏదో మిష మీద వెళ్ళి, వారు చేసే దుర్మార్గపు ఆలోచనలను తెలుసుకుని, వాటిని బయట పెడతానని బెదిరించి, అంతులేని డబ్బు లాగాడు. అతనికి అదే వృత్తి అయిపోయింది. ఆఖరుకు, అతను తన భార్యకు తన మీద ప్రేమ ఏమీలేదని తెలుసుకుని, ఆమెను హత్యచేసి, పూర్తిగా జీవితం మీద విరక్తి చెంది, ఈ హారం ద్వారా ఎవరెవరికి ఎలాటి హాని జరిగినదీ వివరంగా తాళపత్రాల మీద రాసి, ఆ పత్రాలనూ, హారాన్నీ భద్రంగా భూస్థాపన చేశాడు.

భీముడు తాను చదివినదంతా వెంటనే నమ్మలేదు. కొంచెం ఆలోచించిన మీదట, హారానికి ఇతరుల మనస్సు తెలిపే శక్తే ఉంటే, దాన్ని ప్రజల మేలుకు ఉపయోగించవచ్చుననిపించింది. ఏమైనా, హారం మహిమ పరీక్షించుదామని, అతను దాన్ని మెడలో వేసుకుని కృష్ణస్వామి ఇంటికి

వెళ్ళాడు. కృష్ణస్వామికి భీముడు కొద్దిగా డబ్బు బాకీ ఉన్నాడు. అది తిరిగి ఇచ్చే టందుకు అతను కృష్ణస్వామి ఇంటికి వెళ్ళాడు.

ఈ కృష్ణస్వామి అనేవాడు జమీందారు రంగస్వామికి తమ్ముడు. భీముడు వెళ్ళే సరికి కృష్ణస్వామి తన అన్నను చంపించే ఆలోచనలో ఉన్నాడు. ఈ సంగతి భీముడికి తెలిసిపోయింది. అతను కృష్ణస్వామితో, "అయ్యా, అన్నగారు ధర్మాత్ముడు! ఆయనను చంపాలన్న పాపిష్ఠి ఆలోచన తమకు ఎలా కలిగింది? వద్దు! ఆ ఆలోచన మానుకోండి!" అన్నాడు.

కృష్ణస్వామి ఒక్క క్షణం తెల్లబోయి, వెంటనే తెప్పరిల్లి, రాని నవ్వు తెచ్చుకుంటూ, "అదేమిటి, భీముడూ? నా అన్నను నేను చంపుతావా? ఎవరు చెప్పారు నీకీ చాడీ?" అన్నాడు.

"ఎవరు చెబితే నేం లెండి! మీరు మాత్రం మీ ఆలోచన మానుకోవటం మంచిది! ఇదుగో, తమ బాకీ!" అని కృష్ణస్వామికి భీముడు డబ్బు ఇచ్చాడు.

ఆ సమయంలో కృష్ణస్వామి తన వెనకగా ఇద్దరు మనుషులను పంపి, దారిలో హత్య చేయించే ఆలోచనలో ఉన్నట్టు భీముడు తెలుసుకున్నాడు. అతను దారి తప్పించి, ఒక సరుగుడు



తోపులో ప్రవేశించి, మసకచీకట్లో దాక్కున్నాడు.

అతన్ని చంపటానికి కృష్ణస్వామి పంపిన మనుషులు, భీముడు అకస్మాత్తుగా మాయం కావటం చూసి, సరుగుడు చెట్లలో దూరి ఉంటాడని ఊహించి, చెరొక దారినా వాళ్ళు కూడా తోటలో ప్రవేశించారు. భీముడు విడివిడిగా ఇద్దరినీ వెనక నుంచి చావుదెబ్బ కొట్టి పడగొట్టి, వాళ్ళ పంచలతోనే వాళ్ళను చెట్లకుకట్టి, దారేపోయే వాళ్ళచేత జమీందారుకు కబురు చేశాడు.

కృష్ణస్వామి మనుషులు జమీందారు భటుల చేత తన్నులు పడలేక, కృష్ణస్వామి



జమీందారును చంపే ఆలోచనలో ఉన్నట్టు బయట పెట్టారు. కృష్ణస్వామి పరారి అయిపోయాడు. తనకు మేలు చేసిన భీముణ్ణి జమీందారు రంగస్వామి చక్కగా సత్కరించాడు.

అటు తరవాత కూడా భీముడి హారం అనేక మంచి పనులు చేసింది. జయలక్ష్మి అనే కన్య తన మీద మనసుపడి ఉన్నట్టు ఆమెను చూసి తెలుసుకుని, భీముడు ఆమె తండ్రిని కలుసుకుని, పెళ్ళికి ఒప్పించి ఆమెను పెళ్ళాడాడు.

ఇతరుల మనసుల్లో మాటలు తెలుసుకునే శక్తి, భీముడికి ఉన్నట్టు క్రమంగా నలుగురికీ తెలియసాగింది. అతను కొంత మంది దొంగల ఆలోచనలు ముందే గ్రహించి, రాజభటులను హెచ్చరించి, దొంగతనం ఎక్కడ ఏ సమయాన జరగ బోతున్నదీ చెప్పవలసిన వారికి చెప్పి, దొంగలను పట్టిచ్చాడు.

రాను రాను భీముడంటే అందరికీ హడలయిపోయింది. తాము ఏ చెడు ఆలోచన చేస్తే అతను ఎక్కడ తెలుసుకుని పోతాడోనని అందరూ భయపడే వారు. జారులూ, చోరులూ, హంతకులూ లాటి నేరస్థులకు భీముడు సింహస్వప్న మయాడు. అతన్ని చంపెయ్యటం వాళ్ల కొక లెక్కలోది కాదు. కాని అతను ఆ సంగతి కూడా తెలుసుకోగలడు గదా!

అయితే భీముడి శక్తి అంతా హారంలో ఉన్నదన్న సంగతి ఎవరికీ తెలియదు.

త్వరలోనే భీముణ్ణి గురించి గొప్ప గొప్ప వాళ్ళదాకా పోయింది. వారు అతన్ని చేరదీసి, తమను గురించి సాటి వాళ్లు ఏమనుకుంటున్నారో అతని ద్వారా తెలుసుకునేటందుకు ప్రయత్నించారు.

భీముడు కొంత వరకు అందరికీ ఉపయోగపడగలను అనుకున్నాడు గాని, అందులో భయంకరమైన ప్రమాదం ఉన్నదని అతనికి త్వరలోనే తెలిసి పోయింది. ఉన్నత పదవులలో ఉన్న వారందరూ ఒకరి నాశనం ఒకరు కోరు

కుంటున్నారు. ఎవరి మనసులో మాట ఎవరికి చెప్పాలి ?

భీముడు తాను తెలుసుకున్న విషయాలు తనలోనే ఉంచుకుని, తనను నియోగించిన వారికి అబద్ధాలు చెప్ప సాగాడు. మంత్రులూ, సేనాపతులూ, ఆస్థానవిద్వాంసులూ, పురోహితులూ, వైద్యులూ అందరూ కలిసి భీముణ్ణి రాజు గారి కొలువులో చల్లగా ప్రవేశపెట్టి, రాజుగారు ఎవరిని గురించి ఏమను కుంటూండేదీ తమకు ఎప్పటి కప్పుడు చెప్పుతూండమన్నారు. ఇతరుల మనసులో సంగతులు భీముడు గ్రహించగలడన్న సంగతి వాళ్ళు రాజుకు చెప్పారు.

రాజు అతన్ని పరీక్షించగోరి, "నేనే మనుకుంటున్నాను ?" అన్నాడు.

"నేను తమ మనసు తెలుసుకోలేనను కుంటున్నారు." అన్నాడు భీముడు.

రాజు అతన్ని తన కొలువులో చేర్చుకున్నాడు.

కొన్నాళ్ళకు రాజు భీముణ్ణి పిలిపించి, "నేను నిన్నెందుకు పిలిపించాను ?" అని అడిగాడు.

"నా ద్వారా రాణిగారిని గురించి తెలుసుకోవాలని!" అన్నాడు భీముడు.

"భేష్! రాణిగారికి ఈ చీటీ ఇచ్చి, ఆమె ఏమనేదీ తెలుసుకుని, అదే సమ



యంలో ఆమె మనసులో ఉన్న రహస్యం కూడా తెలుసుకుని వచ్చి, ఏకాంతంగా నాకు చెప్పు!" అన్నాడు రాజు.

భీముడు రాణిగారికి చీటీ ఇచ్చాడు. ఆమె దాన్ని చూసి, "సరేనన్నానని రాజుగారికి చెప్పు." అన్నది. అందులో విశేషం ఏమీలేదు ; "సాయంత్రం గానం ఏర్పాటు చెయ్యనా ?" అని రాజు చీటీలో రాశాడు.

అయితే భీముడికి రాణిగారి మనసులోని రహస్యం పూర్తిగా తెలిసిపోయింది. ఆమె రాజును ఏ మాత్రమూ ప్రేమించటంలేదు. ఆమెకు చాలామంది ప్రియులున్నారు!

భీముడు రాజుగారి వద్దకు తిరిగి వచ్చి, ''మహారాజా, రాణీగారు ఉత్తమజాతి పతివ్రత!'' అని చెప్పాడు. రాజు తన మెడలోని రత్నహారాన్ని భీముడికి ఇచ్చాడు.

ఆ రాత్రే భీముడు తన హారాన్ని పొయి మంటలో వేశాడు. అది చిత్రంగా కాలి, ఆవిరి అయింది గాని, కరగలేదు. పొయిలో దాని తాలూకు బూడిద కూడా మిగలలేదు.

ఆ రాత్రే తనకు గొప్ప గొప్ప వాళ్లిచ్చిన ధనమంతా తీసుకుని, భార్యను వెంట బెట్టుకుని, భీముడు మరో దేశం వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అలాటి అద్భుత శక్తులు గల హారాన్ని భీముడు చేజేతులా ఎందుకు నిర్మూలించాడు? అది తనకూ, లోకానికీ కూడా ఎంతో మేలుచేసింది గదా? దాని రహస్యం తనకు తప్ప మరెవరికీ తెలియదు గదా? దాన్ని తాను ధరిస్తే అతనికి ఏం నష్టం? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఏ విధమైన శక్తినయినా బలవంతులు దురుపయోగ పరచగలరు! బలహీనులు ఆ శక్తికి భయపడి నేరాలు చెయ్యటం మానిన మాత్రాన జీవితంలో ఉండే వక్రాలు సరి అయిపోవు. క్రియకు భీముడి హారానికి గల శక్తి అల్పులను పీడించి, మంచి చేసినట్టు కనిపించింది. అదే శక్తి బలవంతుల విషయానికి వచ్చేసరికి భీముణ్ణే పీడించింది. వాడు అల్పుడైపోయి, తన శక్తి, మరొకరికి ఉపయోగపడేలా చేయలేకపోయాడు. భీముడు స్వతహాగా తిన్నని బుద్ధిగలవాడు. అలాటి వాడికి వక్ర మార్గాన నడవటం బాధే. అందుకే వాడు హారాన్ని నాశనం చేసి, బాధనుంచి విముక్తి పొందాడు.'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెకాడు. —(కల్పితం)





# బోడి సలహా

మీనాక్షి ఇద్దరు అన్నల మధ్య గారాబంగా పెరిగిన పిల్ల. ఆ పిల్లకు వయసు వచ్చినప్పటి నుంచీ, ఆమె అన్నలు ఆమెకు పెళ్ళి చెయ్యాలని సంబంధాలు చూడసాగారు. వారికి రామాపురానికి చెందిన గుణశేఖరుడు అనేవాడి తమ్ముడు సోమశేఖరుడు నచ్చాడు. మీనాక్షిని సోమశేఖరుడికి ఇచ్చి పెళ్లి చేసిన అనంతరం ఆమె అన్నలిద్దరూ తాము కూడా పెళ్ళిళ్ళు చేసుకున్నారు.

సోమశేఖరుడుకి ఏ లోటూ లేదు. అతడు అన్నివిధాలా యోగ్యుడు. అతని వ్యాపారం లాభసాటిగా జరుగుతున్నది. అతనికీ, అతని అన్నకూ మంచి ఆస్తిపాస్తులున్నాయి. కాపరానికి వచ్చిన మీనాక్షి అన్ని విషయాలలోనూ తృప్తి పడింది. కాని ఇంటి పెత్తనమంతా తన తోడికోడలిది కావటం ఆమెకు నచ్చలేదు. తోడికోడలు తనపట్ల ఎంత ఆదరమూ, ఆప్యాయతా చూపినప్పటికీ, మీనాక్షికి కావలిసినవి అవికావు. ఆమెకు కావలసినది పెత్తనం!

మీనాక్షి తన కోరికను భర్తకు సూటిగా చెప్పకుండా, డొంకతిరుగుడుగా చెప్పి చూసింది. సోమశేఖరుడు అర్థం చేసుకోని వాడిలాగా ఉండిపోయాడు. చివరకు మీనాక్షి పట్టలేక, ''మనం వేరేకాపరం పెట్టుదామండీ!'' అనేసింది.

సోమశేఖరుడు మొదట నివ్వెరపోయి, తరవాత, ''నన్ను ఆలోచించుకోనీ!'' అని మీనాక్షితో అన్నాడు.

ఇంతలో అతను వ్యాపారం నిమిత్తం శోణాపురం వెళ్లవలసి వచ్చింది. అప్పుడు మీనాక్షి, ''దారేగదా? శోణాపురం నుంచి వచ్చేటప్పుడు మా అన్నలను తొంగి చూసిరండి,'' అన్నది.

గంగిశెట్టి శివకుమార్

సరేనని సోమశేఖరుడు బయలుదేరి వెళ్ళాడు.

అతను తిరిగి వచ్చినాక మీనాక్షి తన అన్నలు ఎలా ఉన్నారని అడిగితే, సోమశేఖరుడు, "మీ అన్నల కేం? బాగానే ఉన్నారు. మీ వదినెల పద్ధతే బాగాలేదు." అన్నాడు.

"ఏం?" అన్నది మీనాక్షి.

"మీ అన్నలను వేరు పడమని మీ వదినెలు పోరు తున్నారట. వాళ్ళ కేమో వేరుపడటం ఇష్టం లేదట. ఏం చెయ్యమంటావని నన్ను సలహా అడిగారు," అన్నాడు సోమశేఖరుడు.

"ఏం చెప్పారు మీరు?" అని మీనాక్షి అడిగింది.

"మనసులు కలవనప్పుడు వేరు పడటమే మంచిదని చెప్పాను. ఇంకేం చెప్పనూ?" అన్నాడు సోమశేఖరుడు.

"మా బాగా చెప్పార్లెండి. బోడి సలహా!" అన్నది మీనాక్షి. తన అన్నలు విడి పోవటమన్న ఆలోచనే ఆమెకు కడుపులో దేవినట్టు అనిపించింది. ఆమె ముఖం చిట్లించుకుని వెళ్ళిపోయింది.

తరవాత కొద్దిరోజులకు మీనాక్షి తాము వేరేకాపరం పెట్టే విషయం భర్తకు జ్ఞాపకం చేస్తూ, "ఆ విషయం ఏం తేల్చారు?" అని అడిగింది.

"తేల్చేదేమున్నదీ? నువు చెప్పినట్టు చెయ్యదలచుకో లేదు," అన్నాడు సోమశేఖరుడు.

"దేనికనీ?" అని మీనాక్షి గదమాయించి అడిగింది.

"అది బోడిసలహా గనక!" అన్నాడు సోమశేఖరుడు.

"నా సలహా మీకు బోడిసలహా అనిపించిందా?" అన్నది మీనాక్షి ఎంతో బాధగా.

"నేను మీ అన్నలకు ఇచ్చినది బోడి సలహా అయితే, నువు నాకు ఇస్తున్న సలహాకూడా అదేగా?" అన్నాడు సోమశేఖరుడు.

మీనాక్షికి చెంపదెబ్బ తగిలినట్టయింది. ఆమె మళ్లీ వేరుకాపరం మాట ఎత్తలేదు.





# పారిపోయిన దొంగ

వీధి తలుపు చప్పుడు కావడంతో, వంట గదిలో ఉన్న రమ వచ్చి తలుపు తీసింది.

ఆ సరికే బాగా చీకటి పడింది.

అవతల ఉన్న మనిషి ఆమెను తోసుకుని లోపలికి వచ్చి, చప్పున తలుపు మూసి, "అరిచావంటే పీక నులిమేస్తాను. అన్నింటికీ తెగించాను! ఖైదులో నుంచి పారిపోయి వస్తున్నాను!" అన్నాడు కరకుగా.

వీధి వెంట నలుగురు మనుషులు పరిగెత్తిన శబ్దం అయింది. వాళ్ళు దొంగను తరుముకుంటూ వస్తున్న రక్షకభటులు.

వాళ్ళను దూరం కానిచ్చి, రమ నవ్వుతూ, "చెరసాలలో సుఖంగా కాలం గడపక, ఏం బావుకుందామని పారిపోయి వచ్చావు?" అని దొంగను అడిగింది.

దొంగ కోపంగా, "ఆ విషయం నీకు అనవసరం. ఇంట్లో ఇంకా ఎవరు ఉన్నారు?" అని అడిగాడు.

"నీకేమీ భయంలేదు. నేను ఒంటరిగానే ఉన్నాను. వంట సగం అయింది. వంట గదిలోకి వస్తావా?" అంటూ దారి తీసింది రమ.

దొంగ ఆమె వెనకనే వంటగదిలోకి వెళ్ళి, ఆమె వేసిన పీట మీద కూర్చున్నాడు.

రమ వంకాయలు తరుగుతూ కళ్ళనీళ్ళు పెట్టుకుని, కొంగుతో తుడుచుకున్నది.

"నేను నిన్ను ఏమీ చెయ్యలేదే? ఎందుకు కన్నీళ్ళు?" అని దొంగ అడిగాడు.

"నిన్ను చూస్తే మా అన్న గుర్తుకు వచ్చాడు. వాడు ఆవేశంలో ఎవరినో

మాచిరాజు కామేశ్వరరావు



కొట్టి, ఖైదు అయాడు. అయితే ఒక రాత్రి నీలాగే పారిపోయి వచ్చాడు. వచ్చిన క్షణం నుంచీ వాడికి శాంతి లేదు! నిద్ర లేదు! అన్న హితవు లేదు! ఇల్లు కదలాలంటే భయం! బయట ఏ చప్పుడు వినిపించినా రక్షకభటులు వస్తున్నారని భయం! పిచ్చివాడిలా తయారయాడు. శిక్ష పూర్తిగా అనుభవించి వస్తే ఇలాటి భయాలు ఉండవు. ధైర్యంగా కొత్త జీవితం ఆరంభించవచ్చును. ఆ మాట నేను చెప్పాను, వాడు వినలేదు. పది రోజులపాటు ఇంట్లోనే అజ్ఞాతవాసం చేశాడు. పదో రోజు రాత్రి హఠాత్తుగా రక్షకభటులు వచ్చారు. భయంతో, ఆలోచించకుండా మేడ మీది నుంచి దూకేసి, దెబ్బలు తగిలి, రెండు రోజుల అనంతరం చచ్చిపోయాడు.'' అంటూ రమ కథ ముగించింది.

దొంగ ఆమెను చూసి జాలిపడుతూ, ''గొంతు తగ్గించు! ఎవరైనా రాగలరు!'' అన్నాడు.

''వంట అయింది. భోజనం చేస్తావా?'' అన్నది రమ.

దొంగకు తినాలనే ఉన్నదిగాని, సందేహించాడు.

''ఇందులో విషం కలపలేదులే! నీ ఎదటేగా వంట చేశాను?'' అంటూ రమ దొంగ ముందు అన్నం, కూరలూ వడ్డించింది.

వాడు భోజనం చేస్తూంటే రమ, ''చూడబోతే మంచివాడివిలాగున్నావు! చెరసాలలో ఎలా పడ్డావు?'' అని అడిగింది.

దొంగ ఇలా చెప్పాడు:

''నా తల్లిదండ్రులెవరో నాకు తెలీదు. ఒక అవ్వ నన్ను పెంచి, పెద్ద చేసింది. నన్ను గారాబంగా పెంచటానికి తాను అష్టకష్టాలూ పడింది. ఆమె పోయాక నా కష్టాలు ప్రారంభమయాయి. నాకు చదువు లేదు. మా పల్లెలో పని లేక పట్నం వచ్చాను. ఏ పనీ ఇచ్చినవారు



లేరు. నాలుగు రోజులు తిండిలేదు. ఆకలి బాధకు తాళలేక, ఒక వ్యాపారస్థుడి చేతిలో ఉన్న సంచీ లాక్కుని, పారిపోయి పట్టుబడ్డాను. రెండు నెలలు శిక్ష పడింది.''

''అలానా పాపం! మరి ఇప్పుడు పారిపోయి ఎందుకు వచ్చావు?'' అని రమ అతన్ని అడిగింది.

''అక్కడ అడ్డమైన చాకిరీ చెయ్యాలి. పెద్ద ఎత్తున వంటలు చెయ్యాలి. తోట పని చూడాలి. బట్టలు పిండాలి. చాపలూ, దుప్పట్లూ నేయాలి. బట్టలు కుట్టాలి—ఇలా ఎన్నోరకాల పనులు! అవన్నీ చేసే ఓపిక నాకు లేదు,'' అన్నాడు దొంగ విసుక్కుంటూ.

రమ నవ్వి, ''బయట పని దొరక లేదని, దొంగతనం చేసి, చెరసాలకు వెళ్ళావు! అక్కడ పని ఎక్కువ అని దొంగతనంగా పారిపోయి వచ్చావు! ఇప్పుడు ఏం చేస్తావు?'' అని అడిగింది.

దొంగ జవాబు చెప్పలేక తల దించుకున్నాడు.

రమ మళ్ళీ ఇలా అన్నది:

''ఇప్పటినుంచీ నీకు నరకబాధలు ప్రారంభమవుతాయి. నిద్రాహారాలుండవు! భయం నిన్ను నీడలా అంటిపెట్టుకుని ఉంటుంది. ఇప్పుడు నువు ఎలా బతుకుతావు? ఉద్యోగం ఎలా దొరుకుతుంది? నీ కిప్పుడు జైలులో ఉన్న స్వేచ్ఛ కూడా లేదు. పారిపోయివచ్చి నీ ఖైదు శిక్షను పెంచుకున్నావు. అంతే! ఆ చెరసాల లోనే ఏ వంటలు చెయ్యడంలోనో, బట్టలు కుట్టడంలోనో, దుప్పట్లు నెయ్యడంలోనో, తోటపనిలోనో ప్రావీణ్యం సంపాదించి ఉంటే, విడుదల అయివచ్చాక, నీ బతుకు నువు స్వతంత్రంగా, గౌరవంగా బతికే మార్గం దొరికేది. అక్కడ నీకు శిక్షతోబాటు ఏదో వృత్తిలో శిక్షణ కూడా దొరుకుతుంది! నువు చాలా తెలివి తక్కువ పని చేశావు—పారిపోయి వచ్చావు!''

దొంగకు కళ్ళు తెరుచుకున్నాయి. అతను తాను చేసిన పొరపాటు గ్రహించాడు.

"నిజమే! పొరపాటు జరిగిపోయింది. దీన్ని దిద్దుకోవడమెలాగ?" అని అతను రమను అడిగాడు.

"మించిపోయిందేమీలేదు. నీ అంతట నువే చెరసాలకు వెళ్ళి, పట్టుబడు. అలా చేస్తే నిన్ను దండించరు! కొద్దిగా నీ శిక్ష పెరగవచ్చు. పని నేర్చుకోడానికి అదీ మంచిదే!" అన్నది రమ.

దొంగ సంతోషంగా, "సొంత చెల్లెలు లాగా మంచి సలహా చెప్పావు. నీ ఋణం తీర్చుకోలేను. వస్తా!" అని, వెళ్ళి పోయాడు.

దొంగ వెళ్ళిన కొంతసేపటికి మళ్ళీ తలుపు చప్పుడు వినిపించింది.

ఈసారి వచ్చినవాడు రమ తండ్రి.

"ఎప్పుడూలేంది, ఇంత ఆలస్యం అయిందేం, నాన్నా?" అని రమ తండ్రిని అడిగింది.

"చెరసాల నుంచి ఒక దొంగ పారి పోయాడు. అందుకే ఆలస్యం అయింది," అన్నాడు తండ్రి.

ఆయన చెరసాల అధికారి.

"మీరు ఖైదీలను చూసే తీరు అలా ఉంటుంది! చెరసాలలు కేవలమూ ఖైదీలను శిక్షించటానికేకాదు, వాళ్ళలో పరివర్తన కలిగించేవిగా కూడా ఉండాలి. మీ చెరసాల నుంచి పారిపోయిన దొంగ మన ఇంటికే వచ్చాడు. నేను ఆ దొంగలో ఉన్న దొంగను పారదోలాను. అందుకోసం ఒక అన్నయ్యను కూడా కల్పించాను," అంటూ రమ జరిగినదంతా చెప్పింది.

"భేష్! చెరసాల అధికారి కూతురివి అనిపించుకున్నావు! అతను చెరసాల చేరాడో, లేదో చూసివస్తాను," అంటూ ఆయన లేచాడు.

"ఆ భయం నీకు వద్దు. చెప్పానుగా? అతనిలో దొంగ పారిపోయాడు! భోజనం చేసి నిదానంగా వెళ్ళవచ్చు నువు," అన్నది రమ.





# పరశురాముడు

## 3

పరశురాముడు కార్తవీర్యుడు మొదలైన క్షత్రియులను చంపి, నర్మదలో స్నానం చేసి, కైలాసానికి వెళ్ళి, శివుడి మందిరంలో ప్రవేశించబోతే వినాయకుడు అడ్డుపడి, లోపలికి వెళ్ళనియ్యలేదు. కొంతసేపు ఇద్దరూ వాగ్వాదం చేసుకుని, చివరకు ముష్టియుద్ధంలోకి దిగారు. వినాయకుడు తన తొండంతో పరశురాముణ్ణి పైకెత్తేసరికి, అతనికి ఊర్ధ్వలోకాలు ఏడూ కనిపించాయి. అతను తన గండ్ర గొడ్డలితో వినాయకుడి దంతం ఒకటి విరగగొట్టాడు.

ఈ హడావుడికి శివపార్వతులు లోపలినుంచి బయటికి వచ్చి, విఘ్నేశ్వరుడికి వచ్చిన కష్టాన్ని కళ్ళారా చూశారు.

పార్వతికి అమితంగా కోపం వచ్చి, ''మనవల్ల ఇన్నివిధాల ఉపకారం పొందినందుకు కృతజ్ఞత లేకుండా ఈ రాముడు నా కొడుకును కొట్టుతాడా?'' అన్నది.

శివుడు ఏమీ చెయ్యలేని స్థితిలో కృష్ణుణ్ణి తలచుకున్నాడు. కృష్ణుడు వచ్చి, పార్వతి కోపంపోయే మాటలు చెప్పి, ''రాముడు మాత్రం నీ కొడుకు లాటివాడు కాడా? అతన్ని క్షమించు!'' అన్నాడు.

రాముడు పార్వతికి క్షమాపణ చెప్పుకున్నాడు.

అక్కడినుంచి రాముడు తన ఇంటికి వచ్చి, తన తండ్రితో తాను చేసిన క్షత్రియ వధ గురించి చెప్పుకున్నాడు. ఆ పాపం పోవటానికి మహేంద్రనగరానికి వెళ్ళి, తపస్సు చెయ్యమని జమదగ్ని రాముడికి చెప్పాడు.

రాముడు తండ్రి చెప్పిన ప్రకారం కొంతకాలం తపస్సు చేశాడు. అంతలో అతనికి

ఒక దుర్వార్త తెలిసింది. అదేమిటంటే, కార్తవీర్యుడి కొడుకు ఒకడు జమదగ్నిని చంపాడట; రాముడి తల్లి భర్తతో సహగమనం చేసిందట.

రాముడికి భరించరాని కోపం వచ్చి, ప్రపంచంలో ఉన్న రాజులందరినీ చంపి, వారి రక్తంతో తన తండ్రికి తర్పణం విడుస్తానని శపథం చేసి, మిగిలి ఉన్న కార్తవీర్యుడి కొడుకులనూ, కనిపించిన రాజులనూ చంపటమే గాక, కార్తవీర్యుడి నగరాన్ని తగలబెట్టాడు. అప్పటికిగాని పరశురామప్రీతి కాలేదు!

హైహయవంశంవారి నందరినీ, అనేక మంది రాజులనూ చంపినందుకు రాముడిలో పరివర్తన కలిగింది. అతను తపోవనానికి పోయి తపస్సు చేసుకోసాగాడు. అక్కడికి ఒకసారి, విశ్వామిత్రుడి మనుమడైన పరావసువు అనేవాడు వచ్చి, ''రాజులకు భయపడి ఇక్కడ దాక్కున్నావా?'' అని రాముణ్ణి హేళన చేశాడు.

అతను ఈ విధంగా రాముణ్ణి రెచ్చగొట్టటంతో తృప్తిపడక, రాముడు చంపకుండా విడిచిన క్షత్రియ వృద్ధులనూ, బాలలనూ యుద్ధానికి పురికొల్పాడు. రాముడు మళ్ళీ యుద్ధానికి పూనుకుని, ఇరవై ఒక్కసార్లు క్షత్రియవధ చేశాడు.

అప్పటికీ రాముడి చేతిలో క్షత్రియులందరూ చావలేదు. కొందరు ఆడవాళ్ళ మధ్యా, పశువులమందలలోనూ దాక్క



న్నారు. వాళ్ళకు పిల్లలు పుట్టి, పెద్ద వాళ్ళయారు. వాళ్ళ ఆచూకీ తెలిసినప్పుడల్లా పరశురాముడు వాళ్ళను చంపుతూ, ఇరవై ఒక్కసార్లు క్షత్రియ నిర్మూలనం చేస్తానన్న తన తొలి ప్రతిజ్ఞను నిలబెట్టుకున్నాడు.

తాను చంపిన రాజుల రక్తాన్ని కురుక్షేత్రంలో అయిదు మడుగులలో నింపి, దానితో తండ్రికి తర్పణ చేశాడు. వీటినే శ్యమంతక పంచకం అని పిలిచేవారు.

రాముడు పితృదేవతలకు తర్పణాలిచ్చేటప్పుడు వారు అతనితో, ''నాయనా, నీ కింకా శాపవిముక్తి పూర్తిగా కలగలేదు. యాగం చెయ్యి.'' అన్నారు. అతను మహేంద్రనగరానికి తిరిగి వచ్చి, మునుల ప్రేరణ మీద అశ్వమేధయాగం ప్రారంభించాడు. ఆ సమయంలో యాగం చూడ వచ్చిన మునులు, గోకర్ణక్షేత్రం సముద్రంలో మునిగిపోతున్నదనీ, దానిని కాపాడమనీ రాముణ్ణి కోరారు.

''అయ్యా, నా తండ్రి ఆజ్ఞ ప్రకారం యాగం ప్రారంభించి, దీక్షలో ఉన్నాను. నే నిప్పుడు ఆయుధాలు ఎలా పట్టను?'' అన్నాడు రాముడు.

''ఆయుధాలు పట్టవచ్చు. తప్పు లేదు,'' అని శుష్కుడు అనే ముని చెప్పాడు.

అప్పుడు రాముడు మునులకోరిక తీర్చటానికి గోకర్ణక్షేత్రం వద్ద సముద్ర తీరానికి వెళ్ళి, వెనక్కు వెళ్ళిపొమ్మని చెప్పటం



కోసం వరుణుణ్ణి పిలిచాడు. కాని వరుణుడు రాలేదు. రాముడు మరొకసారి పిలిచి చూసి, ఆగ్నేయాస్త్రం సంధించేసరికి, అంతటా అగ్నిజ్వాలలు పుట్టుకొచ్చాయి.

సముద్రుడు భయపడుతూ వచ్చి రాముడి శరణుజొచ్చి, "నన్ను ఎంత దూరం పొమ్మంటావో ఆనతియ్యి!" అని కాళ్ళబేరానికి వచ్చాడు.

రాముడు తన చేతిలో ఉన్న స్రువాన్ని దూరంగా విసిరివేస్తే, అది రెండు యోజనాల దూరంలో పడింది. సముద్రుడు అంత దూరం వెనక్కు వెళ్ళాడు.

పరశురాముడు మహేంద్రనగరం మీద ఉండగా కర్ణుడు బ్రాహ్మణుడినని చెప్పుకుని, రాముణ్ణి బ్రహ్మాస్త్రం ఇయ్యమని అడిగాడు. రాముడు కర్ణుడికి ఆ అస్త్రం ఉపదేశించాడు.

ఒకనాడు పరశురాముడు కర్ణుడి తొడపై తల ఉంచి నిద్రపోతూండగా ఆ సమయంలో ఒక పురుగు కర్ణుడి తొడను తొలచనారంభించింది. అందువల్ల గాయమై, రక్తం కారసాగింది. అయినా కాలు కదిలిస్తే, పరశురాముడికి నిద్రాభంగమై కోపం వస్తుందని, కర్ణుడు ఆ బాధను ఓర్చుకుని కదలకుండా ఉండిపోయాడు.

అయితే, రక్తం తన ఒంటికి తగిలి పరశురాముడికి నిద్రాభంగం కానే అయింది.

"ఇలా రక్తం కారుతున్నా నువు సహించగలిగావంటే నువు బ్రాహ్మణుడివి కావు. విద్య కోసం నాతో అబద్ధం చెప్పావు," అని, సహనం కొంచెం కూడా లేని పరశురాముడు, కర్ణుడికి తాను ఇచ్చిన అస్త్రాలు పనిచెయ్యకుండా శాపం పెట్టాడు.

క్షత్రియులను చంపి, వారి రాజ్యాలన్నీ సంపాదించుకున్న పరశురాముడు, తనకు దక్కిన భూమి అంతా కశ్యపుడికి దానంగా ఇచ్చాడు. కశ్యపుడు పరశురాముణ్ణి తన భూభాగం నుంచి వెళ్ళిపొమ్మన్నాడు. పరశురాముడు దక్షిణ సముద్రం దాటి వెళ్ళిపోయాడు. —(అయిపోయింది)





# ఇతిహాసం నుంచి చరిత్రకు

భారతీయ నాగరికత ఏనాటిది? ఈ సనాతన భూమి మీద నివసించిన తొలి మానవులు ఎవరు? ఇలాటి ప్రశ్నలకు సూటి సమాధానాలు దొరకవు. అనేక నాగరికతలు ప్రళయాలలో కొట్టుకు పోయాయని ప్రతీతి.

బహు దీర్ఘ కాలంలో మహర్షులు రచించిన వేదాలను బట్టి, మనకు ఒక నాగరికత ఉండిందనీ, దేవుడూ, జ్ఞానమూ, స్వేచ్ఛా, అమరత్వమూ లాటివి గురించి అన్వేషణ జరిగించనీ తెలుస్తున్నది.





హరప్పా, మొహెంజదారోల వంటి ప్రదేశాలలో మహానగరాల అవశేషాలూ, జనావాసాల శిథిలాలూ బయటపడ్డాయి. అవి అయిదువేల ఏళ్ళకు మించిన వయసు గలవి. ప్రపంచంలో మరెక్కడా ఆ కాలానికి అలాటి నగరం లేదు.



ఒకప్పుడు భారతీయులు సాహసోపేతమైన సముద్రప్రయాణాలు చేశారు. వారు దూరప్రాంతాలకు తమ వర్తకాన్ని, సంస్కృతినీ చేరవేశారు. నాగరికత తొలిదశలో భారతీయులు దక్షిణ అమెరికా దాకా వెళ్ళారని కొందరు పండితుల అభిప్రాయం.

అత్యంత ప్రాచీన నాగరికతలలో ఒకటైన మెసొపొటామియాలో భారతీయుల ముద్రికలూ, మొహెంజొదారోలో మెసొపొటామియా ముద్రికలూ లభించటం వల్ల ఉభయ దేశాలకూ మధ్య రాకపోకలు ఉన్నట్టు స్పష్టమవుతున్నది.





భారతీయ విజ్ఞానులు అనేక దేశాలకు వెళ్ళి, అక్కడి విజ్ఞానులను కలిశారు. ఒక భారతీయుడు, క్రీ.పూ. 5 వ శతాబ్దిలో, గొప్ప గ్రీకుతత్వవేత్త అయిన సోక్రటీసును కలిసినట్టు మనకు రూఢిగా తెలుస్తున్నది.



భారతదేశంలో అనేక ఆధ్యాత్మిక, మత వాదాలు పుట్టాయి. వేదాలూ, ఉపనిషత్తులూ రచించిన ఋషుల అనంతరం, క్రీ.పూ. 6వ శతాబ్దిలో జైనమత స్థాపకుడైన మహావీర జినుడు వచ్చాడు.

గౌతమబుద్ధుడు కూడా క్రీ.పూ. 6వ శతాబ్దిలోనే పుట్టాడు. మోక్షమార్గం అన్వేషిస్తూ, అతను రాజసుఖాలన్నీ వదిలిపెట్టి, తపస్సు చేసి, సత్యాన్ని తెలుసుకున్నాడు.





పురాణాలలో మనకు చాలామంది రాజులు కనిపిస్తారు. చరిత్రకాలంలో, నందవంశాన్ని స్థాపించిన మహాపద్మనందుడు, క్రీ.పూ. 4వ శతాబ్దిలో కళింగ నుంచి పంజాబు దాకా గల విస్తృత దేశాన్ని పాలించటం మనకు తెలుసు.

రాజుల పాలనకు బదులు, ప్రజలు ఎన్నుకున్న సమితుల ద్వారా పరిపాలన జరిగిన ప్రాంతాలు కూడా ఉండేవి. అవి గణతంత్ర రాజ్యాలు. ప్రాచీన భారతంలో అనేక విభాగాలు ఉండి నప్పటికీ సాంస్కృతిక సమైక్యత ఉండేది.





భారత పేఖ్యాతి విదేశీయ రాజుల దాడులను ప్రేరేపించింది. భారత భూభాగంపై మొట్టమొదట దండెత్తి వచ్చిన వాడు పర్షియా రాజు సైరస్. క్రీ.పూ. 6 వ శతాబ్దిలో అతను వాయువ్య ప్రాంతంలో గల గాంధారాన్ని జయించాడు.

రెండు శతాబ్దాల అనంతరం గ్రీసు దేశానికి చెందిన అలెగ్జాండరు పర్షియాను జయించి, ఇండియాలోకి ప్రవేశించాలని కలలుగన్నాడు. ఎందుకంటే, ఆ దేశంలో ఒక చిన్నభాగం జయించినందుకు పర్షియా గర్వించింది.





# సగంధర

రంగయ్య మధ్య తరగతి రైతు. అతనికి ఉన్న ఆస్తి రెండు ఎకరాల పొలమూ, పాతకాలపు మేడా మాత్రమే. రంగయ్య కూతురు పెళ్లి ఈడుకు వచ్చింది. తన కూతుర్ని గొప్పవాడి చేతుల్లో పెట్టాలని రంగయ్య ఆలోచన.

చూడగా, చూడగా, రంగయ్యకు నచ్చిన సంబంధం వచ్చింది. అయితే వాళ్లు మూడువేలు కట్నం అడిగారు. చూస్తూ, చూస్తూ, ఆ సంబంధం వదులుకోలేక, తన పొలం తాకట్టు పెట్టి అప్పు పుట్టించాలని తనకు తెలిసినవాళ్ల నందరినీ కదిలించి చూశాడు. కాని అది మెరక పొలం కావటంచేత ఎవరూ డబ్బిస్తామని ముందుకు రాలేదు.

ఆ గ్రామంలోనే ఉన్న వడ్డీవ్యాపారి వీరయ్యకు ఈ సంగతి తెలిసింది. వాడు జలగజాతివాడు; అప్పు ఇచ్చేవరకూ మంచిగా ఉండి, అప్పు తీరేదాకా అవతల వాణ్ణిపట్టి వదలడు. ఎవరూ తీసుకోని రంగయ్య పొలం తనకు తేలికగా స్వాధీనమవుతుందనుకున్నాడు వీరయ్య.

వీరయ్య మాటలకు రంగయ్య పొంగిపోయాడు. వీరయ్య రంగయ్య పొలాన్ని సగంధరకు కొంటానన్నాడు, అయితే రంగయ్య ఎప్పుడు తన పొలాన్ని తిరిగి కొన దలచినా సగంధరకే అమ్ముతానన్నాడు. వీరయ్య మాటలలో ఏదో మోసం ఉన్నదని శంకించి, రంగయ్య ఆలోచించుకుని మర్నాడు చెబుతాననీ, మర్నాడు రమ్మనమనీ వీరయ్యతో అన్నాడు.

తరవాత రంగయ్య గ్రామకరణం లింగయ్య వద్దకు వెళ్లి, వీరయ్య అన్న మాట చెప్పాడు. లింగయ్య అంతా విని, రంగయ్య దురాలోచన గ్రహించి, అతడికి

షేక్ గాలిబ్

గుణపాఠం చెప్పటానికి మంచి అవకాశం దొరికిందనుకున్నాడు.

"రంగయ్యా, నీ పొలం ఎనిమిదివేలు చేస్తుంది. దాన్ని నాలుగు వేలకే కొట్టేద్దామని వీరయ్య ఎత్తు వేశాడు. నువు నీ కూతురు పెళ్ళి అయాక, మళ్లీ ఆ నాలుగువేలూ చేర్చి తిరిగి పొలం కొంటావనేది ఉత్త మాట! కనక నువు నేను చెప్పినట్టు చేశావంటే నీ కూతురి పెళ్ళి అయిపోతుంది, వీరయ్యా రోగం కూడా కుదురుతుంది!" అని లింగయ్య తన ఆలోచన రంగయ్యకు చెప్పాడు. రంగయ్య ప్రాణం కుదటపడింది.

మర్నాడు రంగయ్య తీరికగా అరుగు మీద కూర్చుని ఉండగా వీరయ్య వచ్చాడు. అదేసమయానికి లింగయ్య కూడా అటేవచ్చాడు.

"సమయానికి వచ్చారు కరణంగారు! సాక్ష్యానికి పనికవస్తారు," అన్నాడు వీరయ్య.

కరణం తాను కూడా అరుగు మీద చతికిలబడి, వీరయ్య కేసి చూస్తూ, "ఏమిటి విషయం?" అని అడిగాడు.

రంగయ్య గొంతు సవరించుకుని, "మరేం లేదు, కరణంగారూ! వీరయ్య నా పొలాన్ని సగం ధరకు తీసుకుంటానంటున్నాడు. మళ్లీ సగం ధర నేను ఎప్పుడిస్తే అప్పుడు పొలం నాకు తిరిగి ఇచ్చేస్తాడట. నా కేమో ఇప్పుడు డబ్బు అవసరంగా ఉన్నది. అందుచేత, అదే



షరతుకు ఇరవైవేలు చేసే నా మేడను వీరయ్యకు అమ్ముదామనుకుంటున్నాను. ఏమంటారు, వీరయ్యగారూ ?'' అన్నాడు.

వీరయ్యకు తన రొట్టె విరిగి నేతిలో పడిందనిపించింది. రంగయ్య పది జన్మలెత్తినా పదివేలు పెట్టి తన వద్ద ఇల్లు తిరిగి కొనలేడు ! ఇరవైవేలు చేసే ఇల్లు పదివేలకే తనది అవుతుంది !

రంగయ్య తన మేడను సగం ధరకు, అనగా పదివేలకు, తనకు అమ్ముతున్నట్టూ, అతను తిరిగి సగం ధరకు తనవద్ద ఆ ఇంటిని ఎప్పుడు కొనదలచినా తాను ఇచ్చేటట్టూ కరణంగారి చేత కాగితం రాయించి, దాని మీద నలుగురి చేతా సంతకాలు పెట్టించి, వీరయ్య అందరి ఎదటా రంగయ్యకు పదివేలు ఇచ్చేశాడు. దాని మీద తాను కూడా సంతకం పెట్టి, కాగితాన్ని కరణం తన వద్ద ఉంచుకున్నాడు.

రంగయ్య తన కూతురి పెళ్ళి నిశ్చయం చేసుకుని, బంధుమిత్రులందరికీ ఆహ్వానాలు పంపాడు. ముహూర్తం సమీపిస్తూండగా, వీరయ్య అరుగురు పనివాళ్లను వెంటబెట్టుకువచ్చి, ''ఈ ఇంటిని నాకు అమ్మావు. ఇందులో నువు పెళ్ళి జరిపించటానికి వీల్లేదు. కావాలంటే, నా డబ్బు నాకిచ్చి నీ ఇల్లు నువు తీసుకో,'' అంటూ రంగయ్యతో పేచీకి దిగాడు.

ఇలా జరగబోతుందని రంగయ్యకు ముందే తెలుసు. అతను ఎదురుగా



కూర్చున్న కరణం కేసి చూశాడు. 'నేను చెప్పినట్టు చెయ్యి.' అన్నట్టుగా కరణం రంగయ్యకు సైగ చేశాడు.

రంగయ్య లేచి, ఇంట్లోకి వెళ్లి, అయిదు వేలు తెచ్చి వీరయ్య చేతిలో పెట్టి, "ఇదుగో నీకియ్యవలసిన సొమ్ము. ఈ ఇల్లు నీ నుంచి తిరిగి కొనుక్కున్నాను. ఇక ఈ ఇల్లు నాది. అతిథివి కాబట్టి, అక్షింతలు వేసి, భోజనం చేసి వెళ్లు," అన్నాడు.

వీరయ్యకు మతిపోయినట్టయింది.

"ఏం, రంగయ్యా? నన్ను ఆడిస్తున్నావా? నువు అయిదు వేలిస్తే సరిపోయిందా? మరో అయిదు వేలు ఇయ్యి. అప్పుడే ఈ ఇల్లు నీది అవుతుంది. చూశావుగా, ఏమంటావు, కరణం?" అన్నాడతను.

"నేనేమంటాను? నువు అనేది తప్పంటాను! కాగితంలో రాసినది అక్షరాలా అమలు జరిగిందంటాను!" అన్నాడు కరణం, జేబులో నుంచి కాగితం తీసి.

"అమలు జరిగిందా? ఏదీ! వీళ్లందరి ముందూ చెప్పు!" అన్నాడు వీరయ్య.

"జాగ్రత్తగా విను. రంగయ్య ఇరవై వేలు ఖరీదు చేసే తన మేడను నీకు సగం ధరకు, అంటే పదివేలకు, అమ్మాడు. అంటే నువు కొన్న ఖరీదు పదివేలే. రంగయ్య సగం ధర ఇచ్చి మేడను తిరిగి కొనుక్కుంటే నీకు అభ్యంతరం లేనట్టుగా ఇందులో సంతకం పెట్టావు. అందుకే రంగయ్య ఇప్పుడున్న మేడ ఖరీదులో సగం ధర, అంటే అయిదువేలు, ఇచ్చి మేడను తిరిగి కొనుక్కున్నాడు. ఇందులో నువు కాదనేటందుకు ఏమీలేదు! ఇక నీకు ఈ ఇంటి మీద అధికారం లేదు," అన్నాడు కరణం.

రంగయ్య మేడను చవకగా కొట్టేద్దామనుకున్న వీరయ్య ఎత్తు బెడిసికొట్టింది. తగిన శాస్తి జరిగిందనుకున్నాడు వీరయ్య. అతను ఈ విధంగా మరెవరినీ మోసం చెయ్యటానికి మళ్లీ ప్రయత్నించలేదు.



# నమ్మకం

ఇమామ్ బుఖారీ అనే సజ్జనుడు ఒకసారి ఓడప్రయాణం చేస్తున్నాడు. ఓడ యజమానితో బాటు చాలా మంది ప్రయాణీకులు కూడా అయనను ఎరుగుదురు. మరికొందరు అయన పరిచయం చేసుకున్నారు. అలాటి వారిలో ఒక ప్రయాణీకుడు ఇమామ్ బుఖారీ వద్ద వెయ్యి దీనారాలు ఉండటం చూసి, వాటిని కాజెయ్యాలన్న దురాలోచన చేశాడు. వాటిని దొంగ తనం చేస్తే పట్టుబడిపోతాడు.

అందుకని ఆ ప్రయాణీకుడు ఒక ఎత్తువేసి, "నా వెయ్యి దీనారాలు పోయాయి.. ఎవరో కాజేశారు!" అని ఓడయజమానికి ఫిర్యాదు చేశాడు. ఓడయజమాని అందరినీ తణిఖీచేసి, ఎవరి దగ్గిరా వెయ్యిదీనారాలు లేవని రుజువు చేసుకున్నాడు. అయన ఇమామ్ బుఖారీని మాత్రం సోదా చెయ్యలేదు.

ఇమామ్ బుఖారీని కూడా సోదా చెయ్యమని రహస్యంగా ప్రయాణీకుడు అన్నాడు. అయనను సోదా చెయ్యనవసరం లేదన్నాడు ఓడయజమాని. అయితే ఇమామ్ బుఖారీ తన సామాన్లు కూడా సోదా చెయ్యమని పట్టుబట్టాడు. అయన వద్ద దీనారాలులేవు.

పట్టలేక ప్రయాణీకుడు, "మీ వెయ్యిదీనారాలు ఏం చేశారు?" అని ఇమామ్ బుఖారీని అడిగాడు.

"సముద్రంలో వేశాను.. అవి నా దగ్గిర కనిపిస్తే, నన్నిక ఎవరన్నా నమ్ముతారా? నాకు డబ్బుకన్న ప్రజల నమ్మకమే ముఖ్యం!" అన్నాడు ఇమామ్ బుఖారీ.

—చాగావురం నాగేశ్వరరావు





# పిశాచాల అనుమానం

రెండు పిల్ల పిశాచాలకు కొన్నాళ్ళపాటు మనుషుల మధ్య పోయి మసలాలని కోరిక కలిగింది. అవి మనుష్యరూపాలు ధరించి ఒక ఊరు చేరుకున్నాయి. ఊరి పొలిమేరలో వాటికి ఒక రైతు కనిపించాడు. ''మీ ఇంట్లో మాకు ఏదైనా పని ఇప్పించండి. నమ్మకంగా చేస్తాం,'' అన్నాయి పిశాచాలు రైతుతో వినయంగా. పని చేసే వంకతో రైతు ఇంట చేరి, అతన్ని ఏడిపించాలని వాటి ఎత్తు.

''ఎడ్ల ధర పెరిగిపోయింది. నా ఎడ్లను దొంగలు ఎత్తుకుపోయారు. మిమ్మల్ని నాగలికి కట్టితే పొలం దున్నగలరా?'' అని రైతు అడిగాడు.

''మనుషులు పొలం దున్నడమా?'' అని పిశాచాలు ఆశ్చర్యంగా అడిగాయి.

''అందులో వింత ఏమిటి? ఎడ్లకన్న మనుషులే చౌక. నా పొలంలో ఇప్పటికి రెండు నాగళ్లు కట్టాను. మీరు సరేనంటే మూడో నాగలి కట్టుతాను,'' అన్నాడు రైతు.

పిశాచాలు రైతు వెంట అతని పొలానికి వెళ్లి, చూస్తే, నలుగురు మనుషులు రెండు నాగళ్ళకు కట్టి ఉన్నారు. మరి ఇద్దరు మనుషులు నాగళ్ళను పట్టుకుని అజమాయిషీ చేస్తూ పొలం దున్నిస్తున్నారు. నాగలికి కట్టి ఉన్న మనుషుల అవస్థ చూస్తే పిశాచాలకు జాలి వేసింది. ఆ అవస్థ ఎలా ఉంటుందో తెలుసుకోవటం కోసం అవి మూడో నాగలికి కట్టించుకుని, కొంతసేపు పొలం దున్నాయి.

రైతు ఎంత కర్కోటకుడో వాటికి తెలిసిపోయింది. అవి ధరించి ఉండిన మనుష్య శరీరాలు ఆ శ్రమకు పూర్తిగా అలసిపోయాయి. రైతు వాటికి ఇచ్చిన ప్రతిఫలం కూడా చాలా స్వల్పం.

"వసుంధర"

రైతు దగ్గిర పని చెయ్యటం తమకు ఇష్టంలేదని చెప్పి, పిశాచాలు అక్కడి నుంచి బయలుదేరాయి. అవి ఒక నూనె వ్యాపారి ఇల్లు చేరి, పని కావాలని అడిగాయి. నూనె వ్యాపారి పని ఇస్తానని చెప్పి, పిశాచాలను తన వెంట లోపలికి రమ్మన్నాడు.

అతను వాటిని ఒక రహస్యపు గది లోకి తీసుకుపోయి, ''మీరు ఈ గది లోనే ఉంటూ, రోజూ ఈ ఫలాల నుంచి నూనె తీస్తూండాలి,'' అన్నాడు.

''ఆ నూనె ఎందుకు? అది విషంతో సమానం కదా?'' అన్నాయి పిశాచాలు.

''ఎందుకేమిటి? మంచినూనెలో కలపడానికి!'' అన్నాడు వ్యాపారి.

''అందువల్ల ప్రజలకు ప్రమాదం కాదా!'' అన్నాయి పిశాచాలు.

''కల్తీలేని నూనె ఎక్కువ ధరకూ, కల్తీనూనె తక్కువ ధరకూ అమ్ముతాను. ఎవరేమైపోతే నాకేం? నాకు కావలసినది డబ్బు,'' అన్నాడు వ్యాపారి.

పేదవాళ్ళందరూ చవకగా కల్తీ నూనె కొనుక్కుని రోగాలు తెచ్చుకుంటారని పిశాచాలకు అర్థమయింది.

''ఈ పని మాకు నచ్చలేదు,'' అని అవి నూనెవ్యాపారికి చెప్పాయి.

''నచ్చలేదంటే కుదరదు. నా రహస్యంతో మిమ్మల్ని బయటికి పోనిస్తానా? ప్రాణాలతో మీరు బయటికి పోలేరు,'' అన్నాడు వ్యాపారి.



"అలాగా!" అంటూ పిశాచాలు మాయమయాయి.

అక్కడినుంచి అవి ఆ దేశపు రాజు వద్దకు వెళ్ళాయి.

ఆ సమయంలో రాజు సేనాధిపతిని మందలిస్తున్నాడు: "ప్రజలు పన్ను లియ్యమంటే కారాగృహంలో తోసి, కొరడాలతో కొట్టండి. బలవంతంగా ఇళ్ళలో జొరబడి పన్నులు వసూలు చెయ్యండి."

పిశాచాలు రెండూ భటుల వేషంలో అక్కడ ప్రత్యక్షమయాయి. వాటిని చూస్తూనే సేనాధిపతి, "రాజాజ్ఞ విన్నారు గదా? ఇక వెళ్ళండి," అన్నాడు.

పిశాచాలు అక్కడినుంచి పోబోతూండగా, రాజు తాను రాజనర్తకి నృత్యం చూసేవేళ అయిందని వెళ్ళిపోయాడు.

పిశాచాలు అనేక చోట్లకు వెళ్ళి, ప్రతిచోటా ఎంతోసేపు ఉండలేకపోయాయి. చివరకు అవి ఎంతో నిరుత్సాహపడి, తమ పిశాచాలు ఉండే చోటికి వెళ్ళిపోయాయి.

ఒక పెద్ద పిశాచం వాటిని పలకరించి, "అప్పుడే వచ్చేశారా? చాలా కాలానికిగాని రారనుకున్నాను. ఏం జరిగిందేమిటి?" అని అడిగింది.

"జరగడానికేమీ లేదు. మనుషులంతా చాలా, చాలా పేదవాళ్ళు, అమాయకులు. ఇదివరకే కొన్ని పిశాచాలు వాళ్ళ మధ్యకు చేరుకుని, మనుష్య రూపాలు ధరించి, మనుషులను నానా యాతనలూ పెట్టుతున్నాయి. మాబోటి పిల్ల పిశాచాలకు అల్లరి చేసే అవకాశం లేదు. పిశాచాల మధ్యకే వెళ్ళేదేమిటని తిరిగి వచ్చేశాం." అన్నాయి పిల్ల పిశాచాలు.

పెద్ద పిశాచం నవ్వి, "మనుషులను యాతనలు పెట్టుతున్నది మనుషులే, పిశాచాలు కావు. మనుషులను గురించిన అనుభవం లేక మీరుఅలా అనుకున్నారు!" అన్నది.

మనుషుల్లో పిశాచాలను మించిన వాళ్ళుంటారని తెలిసి, పిల్ల పిశాచాలు ఆశ్చర్యపడ్డాయి.



# అసలు పందాలు

రంగయ్యా, పుల్లయ్యా న్యాయంకోసం రాజు వద్దకు వచ్చారు. ఇద్దరూ పందెం వేసుకున్నారు. పందెం వంద అని పుల్లయ్య అంటే, రెండు వందలని రంగయ్య అన్నాడట. కాని రంగయ్య పందెం ఓడిపోయి, రెండు వందలకు బదులు రెండు వరహాలే ఇచ్చాడట.

"పుల్లయ్య వంద అంటే నాకు కోపం వచ్చి రెండు వందలన్నాను. వరహాలని నేను చెప్పలేదు. పదివరహాలు కూడా లేవునాకు. వందవరహాలు పందెం కాయగలనా? నా ఉద్దేశం రెండు వందల గవ్వలని!" అన్నాడు రంగయ్య.

రంగయ్య తెలివికి మెచ్చి, రాజు పుల్లయ్యకు రెండు వందల వరహాలిచ్చి, రంగయ్యను తన కొలువులో పెట్టుకున్నాడు.

మర్నాడు వాళ్ళిద్దరూ మళ్ళీ న్యాయం కోసం రాజు వద్దకు వచ్చారు. క్రితం రోజు ఇద్దరూ పందెం వేసుకుని కొంత డబ్బు సంపాదించారట. అది రంగయ్య తెలివి తేటలతో గెలుచు కున్నది. అయినా రంగయ్య దాన్ని అంతా తీసుకోక, పుల్లయ్యతో పంచుకుంటా నంటున్నాడట.

వాళ్ళు తగాదా పడుతున్నది తాను ఇచ్చిన డబ్బు గురించే అనుకుని రాజు, పుల్లయ్య నిజాయితీని మెచ్చుకుని, అతనికి కూడా ఉద్యోగం ఇచ్చి, "మీరు వేసుకున్న పందాలు ఏమిటి?" అని అడిగాడు.

వాళ్లు వేసుకున్న మొదటి పందెం రంగయ్య రాజు కొలువులో చేరతాడని! రెండో పందెం పుల్లయ్యకు కూడా ఇప్పిస్తాడని!

—టి. నాగలక్ష్మి





# జ్ఞానోదయం

రామానందులవారు అనే స్వాములవారు భగవద్గీత మీద అద్భుతమైన ఉపన్యాసాలు, చక్కటి ఉదాహరణలతో, ఎంతో ఆసక్తికరంగా చెప్పేవాడు. ఆయన ఉపన్యాసాలు విన్నవారు ఆయనకు బంగారం దగ్గిర నుంచీ కానుకలు ఇచ్చేవారు. ఆ ధనంతో ధర్మశాలలు కట్టించి, పేద సాదలకు సహాయపడాలని ఆయన ఉద్దేశం. అందుకోసం ఆయన ఊళ్ళ వెంట సంచారంచేసి, డబ్బు పోగుచేస్తూ వచ్చాడు. రామానందులవారి వెంట ఆయన శిష్యుడు ఆదిత్యుడు కూడా ఉండేవాడు.

ఒకరోజు గురుశిష్యులు ఒక గ్రామానికి పోతూండగా ఆదిత్యుడు గురువుగారిని ఒక సందేహం అడిగాడు:

"స్వామీ, భారతయుద్ధంలో పోరాడినదీ, విజయం సాధించినదీ అర్జునుడు గదా, కృష్ణుడు చెప్పినదీ, చేసినదీ మాట సహాయమే గదా? అలాటప్పుడు అర్జునుడికన్న కృష్ణుడికి ఎక్కువ పేరు రావటానికి కారణమేమిటి? పై పెచ్చు, దైవాంశ సంభూతుడైన కృష్ణుడు అనేకసార్లు కుయుక్తులు పన్నటమూ, అర్జునుడిచేతా, భీముడిచేతా అధర్మయుద్ధాలు చేయించటమూ, ఆ విధంగా విజయం సమకూర్చి పెట్టటమూ చూస్తే నాకు భగవద్గీతమీదా, పురాణాలమీదా గౌరవం కలగకుండా ఉన్నది."

శిష్యుడి అనుమానం విని రామానందులవారు నవ్వి, "బాబూ, అవకాశం వచ్చినప్పుడు నీ సందేహానికి సమాధానం అదే వస్తుంది," అన్నాడు.

త్వరలోనే వారు ఒక అడవి ప్రవేశించారు. గురువుగారు ఆదిత్యుణ్ణి ఒక చెట్టు ఎక్కించి, మంచి లావుగల కర్ర

యమ్. డి. సౌజన్య

ఒకటి కోయించాడు. ఆదిత్యుడు ఒక కొమ్మ విరుచుకువచ్చి, దాని రెమ్మలు తీసేసి, మంచి లాఠీగా తయారు చేసి, చేత పట్టుకున్నాడు.

కొద్దిదూరం వాళ్ళు అడవిలోకి నడిచే సరికి ఒక దొంగ ఒక పెద్ద చెట్టుచాటు నుంచి వారి ముందుకు వచ్చి, చేతిలో తుపాకీ పట్టుకుని వారికి గురిపెట్టి, ''మర్యాదగా మీ దగ్గిర ఉన్న డబ్బంతా వెంటనే ఇచ్చెయ్యండి, లేకపోతే చస్తారు!'' అన్నాడు.

అనుకోని ఈ సంఘటనకు భయపడిపోయి, ఆదిత్యుడు వణుకుతున్న కంఠంతో, ''గురుదేవా మీ వద్ద ఉన్న డబ్బుల సంచీ తక్షణం ఈ వెధవకు ఇచ్చి, ప్రాణాలు కాపాడుకోండి,'' అన్నాడు.

వాళ్ల దగ్గిర డబ్బున్నదని రూఢిగా తెలియటంవల్ల దొంగ మరింత రెచ్చిపోయాడు.

రామానందులవారు దొంగతో, ''బాబూ, నా దగ్గిర ఉన్న డబ్బు నిరుపేదల సహాయంకోసం ఖర్చు చెయ్యటానికి కూడబెట్టినది. దీన్ని నువు కోరటం న్యాయంకాదు,'' అన్నాడు.

వెంటనే దొంగ స్వాములవారి మీద కలియబడి బంగారునాణాలు గల సంచీ లాగేసుకుని, ''నేనూ పేదవాణ్ణే! మీడబ్బు నాకు చేరటం న్యాయమే!'' అంటూ వెళ్ళబోయాడు.



స్వాములవారు బాధగా, "బాబూ, నా జీవితమంతా కృషిచేసి కూడబెట్టిన ధనమంతా పోగొట్టుకుని, నేను జీవించటం వ్యర్థం! ఆ తుపాకీతో నన్ను చంపు." అన్నాడు.

దొంగ ఆ మాటకు పకపకా నవ్వి, "స్వామీ, ఇది పేలదు! కొయ్యతుపాకి!" అన్నాడు తన తెలివితేటలు బయట పెడుతూ.

స్వాములవారు వెంటనే, "నా అనుమానం నిజమేనన్న మాట! కొయ్య తుపాకీతో వాడు ఏం చేస్తాడు? ఆదిత్యా, చూస్తావేం? ఆ లాఠీతో రెండు తగలనీ!" అన్నాడు ప్రోత్సాహపూర్వకంగా.

అంతే! ఆదిత్యుడు గొప్ప వీరకేసరి అయిపోయి, దొంగ వీపును చిట్లగొట్టేశాడు. దొంగను చేతులు విరిచి చెట్టుకు కట్టేశారు. వాడు తీసుకున్న డబ్బు సంచీ తిరిగి వచ్చింది.

గురు శిష్యులు తిరిగి ప్రయాణం సాగించారు.

"శిష్యా, భారతయుద్ధం చేసినది అర్జునుడైతే, తంత్రం చెప్పినది కృష్ణుడు. దొంగను కొట్టి లొంగదీసినది నువు! కాని అడవిలో ప్రవేశించే వాడి చేతిలో కర్ర ఉండాలని చెప్పినదీ, దాన్ని ఎప్పుడు వాడాలో చెప్పినదీ నేను! దొంగ చేతిలో ఉండిన తుపాకి వాడిచేతిలో మరీ పుల్లలాగా ఆడటం చూసి, అది కొయ్యతుపాకీ ఏమో నని అనుమానించాను. ఆ మాట వాడిచేతనే పలికించి, రుజువు చేసుకున్నాను. వాడి మీద తంత్రం ప్రయోగించే ముందు, నా డబ్బు ఆశించవద్దని నీతి బోధచేశాను. వాడు వినలేదు. దండ ప్రయోగం తప్పని సరి అయింది. ఒక్క దొంగను లొంగ దీసుకోవటానికి ఇంత తతంగం ఉంటే, వంద మంది కౌరవులనూ, వారి బలాలనూ జయించటానికి కృష్ణుడు ఎంత తంత్రాంగం నడిపి ఉండాలి?" అన్నాడు స్వాములవారు.

ఈ మాటలతో ఆదిత్యుడికి జ్ఞానోదయమయింది.






సూర్యవంశంలో రాముడికి పూర్వం చాలా కాలం క్రితం త్రిశంకుడు అనే రాజు ఉండేవాడు. ఈ త్రిశంకుణ్ణే విశ్వామిత్రుడు బొందితో స్వర్గానికి పంపుతానని చెప్పి పంపలేక, అతని కోసం త్రిశంకు స్వర్గం ఒకటి సృష్టించాడు.

ఈ త్రిశంకుడికి హరిశ్చంద్రుడు అనే కొడుకు ఉండేవాడు. అతనికి సంతానం లేకపోవటంచేత, తనకు పిల్లలు కలిగితే వరుణుడికి నరబలి ఇస్తానన్నాడు. తరవాత అతని భార్య గర్భవతి అయి, ఒక కొడుకును కన్నది. హరిశ్చంద్రుడు గొప్పగా బారసాల చేసి, దానాలు చేశాడు.

ఆ సందర్భంలో బ్రాహ్మణుడి రూపంలో వరుణుడు వచ్చాడు. అతను కూడా దానాలు పుచ్చుకుని, "నీ కొడుకును నాకు బలిపెట్టి, అన్నమాట నిలుపుకో." అన్నాడు.

"మహాత్మా, నా భార్యకు నెలదాకా పురిటిమైల పోదు గదా. అంతదాకా ఆగు." అన్నాడు హరిశ్చంద్రుడు.

వరుణుడు సరేనని వెళ్ళిపోయి, నెల కాగానే మళ్ళీ వచ్చాడు. హరిశ్చంద్రుడు అతనికి అతిథిసత్కారాలు చేసి, "తమరు వచ్చిన పని ఏమిటి?" అని అడిగాడు. వరుణుడు చెప్పాడు.

"ఇంత పసిగుడ్డు యజ్ఞపశువుగా పనికి రాదు గదా! వాడికి ఉపనయనసంస్కారం అయినదాకా ఆగండి," అన్నాడు హరిశ్చంద్రుడు.

**19. హరిశ్చంద్రుడి కథ**



కొండగుహలో దాక్కున్నాడు. వాడికి నాలుగుకాలాలపాటు బతకాలని ఉన్నది!

ఇంతలో వరుణుడు వచ్చి నరమేధం చెయ్యమని కూర్చున్నాడు.

"అయ్యో, బాబూ! నా కొడుకు ఎటో పారిపోయాడు. నేనేంచేతును?" అన్నాడు హరిశ్చంద్రుడు దీనంగా.

"అబద్ధమాడి నన్ను మోసగించి నందుకు నీకు జలోదరం అనే వ్యాధి కలుగుగాక!" అని వరుణుడు హరిశ్చంద్రుణ్ణి శపించాడు.

శాపం తగిలి, హరిశ్చంద్రుడు ఒకవంక వ్యాధితో బాధపడుతూ, మరొకవంక కొడుకు కోసం తపించసాగాడు.

ఈ పరిస్థితిలో, రహస్యంగా గుహలో జీవిస్తున్న లోహితాక్షుడికి బాటసారి ఒకడు కనిపించి, "నీ కోసం నీ తండ్రి విలవిల లాడిపోతూంటే, నీ లాగా పట్టించుకోని కొడుకు ఎక్కడైనా ఉంటాడా?" అన్నాడు.

ఇంతమాట అనిపించుకుని లోహితాక్షుడు తన తండ్రిని చూడటానికి బయలుదేరుదా మనుకుంటూండగా, ఇంద్రుడు బ్రాహ్మణవేషంలో వచ్చి, ఎంతో జాలి ఉట్టిపడేలాగా వాడితో, "ఎందుకు వెళ్ళి నిష్కారణంగా చస్తావు? నా మాట విను. నీ తండ్రి రోగ బాధ నుంచి విముక్తి పొందటానికి నిన్ను వరుణుడికి బలి ఇయ్య

వరుణుడు కోపంతో, "కొడుకు మీది ప్రేమతో ఇలా అంటున్నావు. నేను తెలుసుకోలేనా? అయినప్పటికీ ఈసారికి నీ మాట ప్రకారం వెళ్ళిపోయి, నీ కొడుకు ఉపనయన సంస్కారం జరిగినాక మళ్ళీ వస్తాను. అప్పుడు మరొకసారి మాట తప్పావే, నిన్ను శపించి తీరుతాను," అని వెళ్ళిపోయాడు.

తరవాత హరిశ్చంద్రుడు తన కొడుక్కు లోహితాక్షుడు అని నామకరణం చేసి, చక్కగా చదివించాడు.

తాను బలిపశువుగా చావవలసి ఉన్న దని ఎరిగి, ఆ కుర్రవాడు, ఇంటి నుంచి పారిపోయి, ఎవరికీ కనపడకుండా ఒక



బోతున్నాడు! అలా ఇస్తానని నువు పుట్టక ముందే వరుణుడికి మాట ఇచ్చాడు," అని, వాడి మనసు మార్చేశాడు.

ఇలా ఒకసారి కాదు, అనేకసార్లు జరిగింది: తన తండ్రి వ్యాధిపీడ అనుభవిస్తున్నాడని విని లోహితాక్షుడు ఇంటికి బయలుదేరబోవటమూ, ఇంద్రుడు అతని నిర్ణయాన్ని పడగొట్టటమూనూ!

ఒకనాడు హరిశ్చంద్రుడు తన కుల గురువైన వసిష్ఠుడితో, "ఈ జలోదరంతో బాధపడుతున్న నన్ను ఎలాగైనా కాపాడు!" అన్నాడు.

దానికి వసిష్ఠుడు, "ఇందుకు ఒకటే ఉపాయం ఉన్నది. కొడుకులలో పదమూడు రకాలవాళ్ళున్నారు. అందులో క్రీతుడు (డబ్బు ఇచ్చి కొనుక్కున్నవాడు) ఒకడు. కనక, ఎవరి కొడుకునైనా కొని, వాణ్ణి బలిపశువుగా పెట్టి యజ్ఞం చేసి, ఈ వ్యాధి నుంచి బయటపడు," అన్నాడు.

ఆ మాట మీద హరిశ్చంద్రుడు తన మంత్రులతో, "ఎవరన్నా బ్రాహ్మణుడు తన కొడుకును అమ్మేటట్టుంటే, అతడికి ధనాశ ఎంత ఉన్నా సరే తృప్తిపరచి, కుర్రవాణ్ణి కొనుక్కురండి," అన్నాడు.

వాళ్ళు అనేక గ్రామాలు గాలించి, చివరకు అజీగర్తుడు అనే కటిక దరిద్రుడైన బ్రాహ్మణుడి కొడుకులలో మధ్యవాణ్ణి, శునశ్శేపుడు అనే వాణ్ణి; బ్రాహ్మణుడు అడిగిన ధనం ఇచ్చి కొన్నారు.

నరబలికి మనిషి దొరికినందుకు సంతోషించి, హరిశ్చంద్రుడు యజ్ఞసంభారాలు సమకూర్చుకుని, ఋత్విక్కులను నియమించి, యజ్ఞం ప్రారంభించాడు. శునశ్శేపుణ్ణి యూపస్తంభానికి కట్టారు. వాడు పెద్దపెట్టున ఏడుస్తూ ఉంటే, విశ్వామిత్రుడికి వాడిమీద జాలి కలిగింది. ఆయన హరిశ్చంద్రుడితో ఇలా అన్నాడు:

"రాజా, ఈ బ్రాహ్మణ బాలుణ్ణి ఎందుకు చంపుతావు? విడిచిపెట్టు. వాడు ఏడుస్తూంటే నా గుండె నీరయిపోతున్నది. పూర్వం మీ వంశపు రాజులు ఇతరుల



వేగంగా వచ్చి, కుర్రవాణ్ణి విడిపించి, హరిశ్చంద్రుడికి వ్యాధిబాధ లేకుండా చేసి, వెళ్ళిపోయాడు.

ఈ విధంగా శునశ్శేపుడు బతికి బయట పడటానికి విశ్వామిత్రుడు సహాయ పడ్డాడు, కాని హరిశ్చంద్రుడు తన మాట వినలేదన్న సంగతి మనసులో ఉంచుకున్నాడు.

ఇంతలో ఒకనాడు హరిశ్చంద్రుడు కౌశికినదీ తీరాన వేటకు వెళ్ళి, ఒక అడవిపందిని తరుముతూండగా, మధ్యాన్నం వేళ, విశ్వామిత్రుడు ఒక ముసలి బ్రాహ్మణుడి రూపంలో అక్కడికి వచ్చి, హరిశ్చంద్రుణ్ణి మోసం చేసి, అతని రాజ్యంతో బాటు సర్వస్వమూ కాజేశాడు.

తరవాత వసిష్ఠుడు విశ్వామిత్రుణ్ణి యాదృచ్ఛికంగా కలుసుకుని, "నువు ఎంత నీతిమాలినవాడివి! నా యజమాని అయిన హరిశ్చంద్రుణ్ణి నిష్కారణంగా మోసపుచ్చి అడవులపాలు చేశావు గదా! నువు తాపసులలో అధముడివి! నీ తపస్సు బకధ్యానం! నువు కొంగవైపో!" అని శపించాడు.

ఇందుకు విశ్వామిత్రుడు మండిపడి, "సరే, నేను ఎంతకాలం కొంగగా ఉంటానో నువు అంతకాలమూ

కోసం తమ ప్రాణాలు ధారపోశారు. నీ రోగం నయం చేసుకునేటందుకు ఇలాటి పని చేస్తావా? నీ బాధ నేను నివారణ చేస్తాను. ఈ కుర్రవాణ్ణి విడిచి పెట్టు. ఎంత పాపిష్ఠివాడివి కాకపోతే ఈ కుర్రవాణ్ణి చంపబోతావు?" అన్నాడు.

ఈ విధంగా విశ్వామిత్రుడు ఎంత చెప్పినా హరిశ్చంద్రుడు శునశ్శేపుణ్ణి విడిచిపెట్టటానికి ఒప్పుకోలేదు. అప్పుడు విశ్వామిత్రుడు శునశ్శేపుడికి వరుణదేవుడికి ప్రీతి కలిగించే మంత్రం ఉపదేశించాడు.

శునశ్శేపుడు ఆ మంత్రాన్ని జపించే సరికి వరుణుడు పరమసంతోషంతో అతి

కొక్కెరగా ఉండు!'' అని వసిష్ఠుడికి ప్రతిశాపమిచ్చాడు.

అదిమొదలు ఇద్దరూ పక్షిరూపాలు ధరించి, మానసతీర్థం గట్టున ఉండే చెట్ల మీద నివసిస్తూ, రోజూ హోరాహోరి పోట్లాడుకుంటూ, ఒకరి నెత్తురు ఒకరు కళ్ళజూస్తూ వచ్చారు. ఎంత మహర్షులైనా, అహంకారం చావదు గదా!

వసిష్ఠ విశ్వామిత్రులు రోజూ పక్షుల రూపంలో పరస్పరం హింసించుకొంటూంటే, బ్రహ్మ వచ్చి ఇద్దరి శాపాలూ, తీర్చి, వాళ్ళను తమ తమ ఆశ్రమాలకు పంపాడు. అయినా వసిష్ఠుడు నిమిని శపించి, నిమి చేత మళ్ళీ ప్రతిశాపం పొందాడు. అది ఇలా జరిగింది:



ఇక్ష్వాకుడి కొడుకైన నిమి ధర్మాత్ముడూ, సద్వర్తనం గలవాడూనూ. అతను బ్రాహ్మణుల కోసం, గౌతమాశ్రమానికి సమీపంగా, అన్ని సౌకర్యాలూ కలిగిన జయంతుపురం అనేదాన్ని నిర్మించాడు.

తరవాత కొంతకాలానికి నిమికి దీర్ఘకాల యాగం చెయ్యాలన్న కోరిక కలిగింది. అతను తన తండ్రి అనుమతిపొంది, మహామునులు చెప్పిన ప్రకారం సంభారాలు సమకూర్చుకుని, భృగువూ, అంగిరసుడూ, గౌతముడూ, పులస్త్యుడూ, ఋచీకుడూ, పులహుడూ లాటి యజ్ఞనిపుణులను ఆహ్వానించి, తన కులగురువైన వసిష్ఠుడితో, "మహాదేవిని గురించి అయిదు వేల ఏళ్ళ యజ్ఞం చేయ నిశ్చయించి, సంభారాలు సమకూర్చాను. నా చేత యజ్ఞం చేయించు,'' అన్నాడు.

దానికి వసిష్ఠుడు, ''ఇంద్రుడు కూడా జగదంబ యజ్ఞం తనచేత చేయించమని నన్ను అడిగాడు. అది అయిదువందల ఏళ్ళలోనే పూర్తి అవుతుంది. అది పూర్తి చేసి వచ్చి, నీ చేత యజ్ఞం చేయిస్తాను. అంతదాకా ఓపికపట్టు,'' అని నిమితో అన్నాడు.

''మునులనందరినీ పిలిచాను. సంభారాలు సిద్ధం చేయించాను. మా సూర్య



పోతూ ఉండటంచేత వసిష్ఠుడికి నిమి దర్శనం కలగలేదు.

వసిష్ఠుడు మండిపడి, "కులగురువునైన నన్ను కాదని, నా పదవి మరెవరికో నిర్లక్ష్యంగా ఇచ్చి, యజ్ఞం చేయించుకోవటంతో పోనియ్యక, నేను నిన్ను చూడ వస్తే అవమానిస్తావా? నీ దేహం నేలబడుగాక! నువు విదేహుడవై పోవుదువుగాక! ఇదే నీకు నా శాపం!" అన్నాడు.

ఈ శాపం విని కంగారుపడి నిమిని అతని సేవకులు నిద్రలేపి, వసిష్ఠుడి శాపం గురించి చెప్పారు. నిమి పచ్చి వసిష్ఠుడితో, "బ్రహ్మదేవుడికి దగ్గిర బంధువువై ఉండి, వంశానికి పురోహితుడివై ఉండి, ఇలా అనటం భావ్యమా? ధనలోభం కొద్దీ నన్ను ఇలా మోసం చేస్తావా?" అని నిమి అడిగాడు.

అయినా వసిష్ఠుడు వినిపించుకోకుండా, ఇంద్రుడి చేత యజ్ఞం చేయించటానికి వెళ్ళిపోయాడు. అప్పుడు నిమి గౌతముణ్ణి ఋత్విజుణ్ణిగా పెట్టుకుని, అంబ గురించి విజయవంతంగా యజ్ఞం చేసి, అందరికీ ఘనంగా దక్షిణ లిచ్చాడు.

ఈలోపలనే వసిష్ఠుడు ఇంద్రుడి చేత యజ్ఞం చేయించి, పుష్కలంగా దక్షిణ తీసుకుని, యజ్ఞదీక్షలో ఉన్న నిమిని చూడ వచ్చాడు. కాని నిమి ఆ సమయంలో నిద్ర పాపభీతి లేకుండా నన్ను నిష్కారణంగా శపించావు! ధనలోభంతో నీ శిష్యుడినైన నన్ను వదిలేసి వెళ్ళిపోయావు. ధనం నీకు సిగ్గు కూడా లేకుండా చేసింది! నువు చేసిన తప్పు నాకు అంటగట్టి నన్ను శపించావు. ఇంత క్రోధం గల నీ శరీరానికి కూడా నా శరీరానికి పట్టే గతే పట్టుగాక!" అని ప్రతిశాపమిచ్చాడు.

ఇలా ఇద్దరూ ఒకరి నొకరు శపించుకున్న అనంతరం వసిష్ఠుడు బ్రహ్మ వద్దకు వెళ్ళి, "నిమి అనే రాజు నా శరీరం పడిపోవాలని శపించాడు. మరొక దేహంలో నా జ్ఞానం నిలిచి ఉండే దారి చెప్పు, మహాత్మా!" అన్నాడు.

దానికి బ్రహ్మ, "మిత్రావరుణ దేహాంశ గలవాడివై, జ్ఞానం దక్కించుకో," అన్నాడు.

వసిష్ఠుడు బ్రహ్మకు నమస్కరించి, వెంటనే వరుణ లోకానికి వెళ్ళి, తన శరీరాన్ని అక్కడ వదిలేసి, తన ప్రాణాన్ని మిత్రావరుణుల యందు ప్రవేశపెట్టాడు.

కొంతకాలం గడిచినాక అక్కడికి ఊర్వశి వచ్చింది. మిత్రావరుణులు ఆమెను మోహించి, ఆమెతో కొంతకాలం సంసారం చేశారు. దాని ఫలితంగా వారికి ఊర్వశి యందు అగస్త్యుడూ, వసిష్ఠుడూ పుట్టారు. అగస్త్యుడు పుట్టుతూనే తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోయాడు.

వసిష్ఠుణ్ణి ఇక్ష్వాకుడు తన గురువుగా పెట్టుకున్నాడు.

అక్కడ నిమి కూడా కొస ప్రాణాలతో యజ్ఞం పూర్తి చేశాడు. యజ్ఞభోక్తలు అతని వద్దకు వచ్చి, "రాజా, నీ యజ్ఞం మాకు చాలా తృప్తి కలిగించింది. నీ కోరిక చెప్పు. తీర్చుతాం. నీకు నరదేహం కావాలా? సురదేహం కావాలా?" అని అడిగారు.

"మహాత్ములారా, శరీరం ఉన్నంత కాలమూ దానికి అపాయం ఉండనే ఉంటుంది. నాకు ఏ శరీరమూ వద్దు. వాయురూపం అనుగ్రహించండి," అన్నాడు నిమి.

"రాజా, నీ కోరికను జగదంబ తీర్చగలదు." అని దేవతలు నిమికి చెప్పారు.

నిమి ప్రార్థించగా, దేవి ప్రత్యక్షమై, "సమస్త భూతాల కళ్ళయందూ నీకు నివాసం కలిగిస్తాను. నీ మూలంగా ప్రాణులకు నిమిషం (రెప్పపాటు) కలుగుతుంది," అన్నది.

తరవాత మునులు నిమి దేహాన్ని మథించి, దాని నుంచి జనకుణ్ణి పుట్టించారు. జనకుడు విదేహుడైన నిమి కొడుకు గనక అతను విదేహుడని పేరు తెచ్చుకుని, మిథిల రాజధానిగా గంగాతీరాన రాజ్యం చేశాడు. ఆ రాజ్యం పేరే విదేహ అయింది.





# విచిత్ర వివాహం

పూర్వం పాటలీపురంలో ఒక ధనవంతుడైన బ్రాహ్మణుడికి కేసటు డనే కుమారుడుండేవాడు. అతడు అసాధారణమైన అందచందాలు కలవాడు. యుక్తవయసు రాగానే అతనికి పెళ్ళాడాలనిపించింది. తనకు తగిన అందగత్తె ఎక్కడా కనపడనందున కేసటుడు, తీర్థయాత్రలు చేసి వస్తానని తలిదండ్రులతో చెప్పి కన్యాన్వేషణకు బయలుదేరాడు.

కేసటుడు చాలారోజులు ప్రయాణం చేసి నర్మదాతీరం చేరాడు. ఆ సమయానికే అక్కడికి పెళ్ళివారి గుంపొకటి వచ్చి చేరింది.

ఆ గుంపులోనుంచి ఒక ముసలిబ్రాహ్మణుడు, కేసటుడి అందచందాలను చూసి అతని దగ్గిరికి వచ్చి, ''నాయనా, పెద్దవాణ్ణి, నా కొక్క సహాయం చేసిపెడుదూ!'' అని ఎంతో దైన్యంగా అడిగాడు.

ముసలివాడిపైన జాలికలిగి కేసటుడు, ''చెప్పండి, నా చేతనైతే అలాగ చేస్తాను,'' అన్నాడు.

''నాకి సహాయం చేయటంవల్ల నీ కేమీ నష్టం వుండదు. నా వంశం మాత్రం నిలబెట్టినవాడవవుతావు,'' అన్నాడు ముసలి బ్రాహ్మణుడు.

''నేనేంచెయ్యాలి?'' అన్నాడు కేసటుడు.

''నర్మదకు అద్దరిని రత్నదత్తు డనే బ్రాహ్మణుడున్నాడు. ఆయనకు రూపవతి అనే కుమార్తె, చక్కనిచుక్క, ఉన్నది. ఆ పిల్లను నా కొడుక్కు చేసుకోవటానికి పోతున్నాం. నా కొడుకును యింకా వారు చూడలేదు. నువు ఎంత అందగాడివో, మా వాడంత కురూపి. వాణ్ణి చూస్తే రత్నదత్తుడు పిల్ల నివ్వడు. అందుచేత నువు నా వెంట వస్తివా, నువే నా కొడుకువని



ఆ సాయంకాలం కేసటుడు కాల కృత్యాలు తీర్చుకునేటందుకు నది దగ్గిరికి వెళ్ళేసరికి అతన్ని ఒక రాక్షసుడు పట్టుకుని తినబోయాడు. తాను ఒక బ్రాహ్మణుడికి సాయపడటానికి మాట ఇచ్చాననీ, ఆ పని పూర్తిచేసి మర్నాడు రాత్రి వస్తాననీ, అప్పుడు రాక్షసుడు తనను తినవచ్చుననీ కేసటుడు చెప్పాడు.

"ఆడితప్పవు గద?" అన్నాడు రాక్షసుడు అనుమానిస్తూ.

"ఆడితప్పను గనకనే దుర్మార్గుడైన ఆ బ్రాహ్మణుడికి సాయంచేస్తున్నాను," అన్నాడు కేసటుడు.

"సరే వెళ్ళిరా. నీ సత్యసంధత ఎలాంటిదో చూస్తాం!" అన్నాడు రాక్షసుడు.

కేసటుణ్ణి పెళ్ళికొడుకును చేశారు. వివాహం సక్రమంగా జరిగిపోయింది. ఆ రాత్రి వధూవరులను గదిలోకి పంపారు. కాని కేసటుడు రూపవతి కేసి చూడలేదు, ఆమెతో మాట్లాడలేదు. ఇంత అందగాడు తనకు భర్త అయినాడని సంతోషించిన రూపవతి, తన భర్తకు తనపై ఆగ్రహం కలిగిందనుకుని, ఏమిచెయ్యటానికీ తోచక నిద్రపోయేదానిలాగా కళ్ళుమూసుకుని పడుకున్నది.

ఒకరాత్రివేళ కేసటుడు, రూపవతి గాఢనిద్రలో ఉన్నట్టు ఊహించి, మెల్లిగా

చెబుతాను; నిన్నే పెళ్ళికొడుకును చేస్తాం; పిల్ల మెళ్ళో నువే తాళి కట్టు! పెళ్ళి అయిపోయాక నీ దారిన నువు వెళ్ళు. నా దారిన నేను కోడల్ని తీసుకుని మా ఊరు పోతాను. ఈ సహాయం చేసినందుకు నీ రుణం ఉంచుకోనులే, బాబూ!" అన్నాడు బ్రాహ్మణుడు

ఆ ముసలివాడి నీచత్వానికి కేసటుడు దిగ్భ్రమచెందాడు. కాని ముందుగా మాట ఇచ్చాడు కనక ముసలివాడు కోరినట్టు చెయ్యక తప్పిందికాదు. అతను కూడా పెళ్ళి ముఠాలో చేరి పడవల మీద నది దాటి ఆ సాయంకాలమే పెళ్ళివారి ఊరు చేరాడు.

గది నుంచి బయటికి వచ్చి, నదీతీరాన ఉన్న రాక్షసుడి దగ్గిరికి బయలుదేరాడు. ఇదంతా గమనిస్తున్న రూపవతి కూడా లేచి మేలిముసుగు కప్పుకుని కేసటుణ్ణి కొంత దూరంలో అనుసరించి నడవసాగింది.

కేసటుడు నది దగ్గిరికి వచ్చేసరికి రాక్షసుడు కనిపించి, ''యువకుడా, భలే! అన్నమాట నిలబెట్టుకున్నావు. ఇంత సత్యసంధుడివైన నిన్ను తిని నేను పవిత్రుణ్ణవుతాను!'' అన్నాడు.

ఇదిచూసి రూపవతి ముందుకువచ్చి ఆక్రోశిస్తూ, ''అయ్యా, ఆయన నా భర్త! వదిలిపెట్టు!'' అన్నది.

''నాకు ఆకలిగా ఉన్నది. నే నితన్ని తినకమానను. అడ్డు రాకు. తక్షణం యిక్కడినుంచి వెళ్ళిపో.'' అన్నాడు రాక్షసుడు కోపంగా.

''నీకు ఆకలిగా ఉంటే నన్ను తిని ఆయనను విడిచిపెట్టు. ఆయనను భక్షించి నన్ను దిక్కులేనిదాన్ని చేస్తే నా గతి ఏంకాను?'' అన్నది రూపవతి.

''అందుకు నన్నేం చెయ్యమన్నావు? పోయి, ఎక్కడైనా బిచ్చమెత్తుకో!'' అన్నాడు రాక్షసుడు.

''అనాథనైపోతే నాకెవరు భిక్ష పెడతారు? ఆ మాత్రం నీకు తెలియదా,'' అన్నది రూపవతి.

''నువ్వడిగితే భిక్ష పెట్టనివాడు తల పగిలి చస్తాడు, సరేనా? ఇక వెళ్ళు!'' అన్నాడు రాక్షసుడు.






"అయితే నిన్నే అడుగుతాను. నాకు పతిభిక్ష పెట్టు," అన్నది రూపవతి.

ఆమెను చూసి రాక్షసుడికి చాలా ఆనందమయింది. "ఇదుగో, నీ భర్త! తీసుకో! అతనికి తగ్గ భార్యవే దొరికావు! మీ ఇద్దరూ నాలుగుకాలాలపాటు సుఖంగా ఉండండి," అని వాళ్ళిద్దరినీ దీవించి రాక్షసుడు చీకటిలో ఎటో వెళ్ళిపోయాడు.

రూపవతి పతిభక్తి చూసి కేసటుడికి ఎంతో ఆనందం కలిగింది. అయినా అతను ఆమెతో అసలు విషయం చెప్పలేదు. తెల్లవారేలోపుగా వారు ఇంటికి తిరిగి వచ్చారు.

మర్నాడు భోజనాలు పెందలాడే ముగించి పెళ్ళివారు పెళ్ళికూతురుతో సహా ఇంటికి తరలారు. కృతఘ్నుడైన ముసలి బ్రాహ్మణుడు, ఏరు దాటి తెప్ప తగలేసినట్టుగా, కేసటుడితో పని అయిపోయింది గనక అతనికి పెట్టిన నగలూ, వస్త్రాలూ లాక్కుని, తనవారినందరినీ ఒక పడవలో ఎక్కించి, మరొక పడవలో కేసటుణ్ణి ఎక్కించాడు. రెండో పడవవాళ్ళకి పుష్కలంగా డబ్బిచ్చి, నడియేట్లో పడవను ముంచెయ్యమని కూడా చెప్పాడు. నది దాటేటప్పుడు ముందు పడవ సవ్యంగా అవతలి ఒడ్డు చేరింది. వెనక పడవ మాత్రం నట్టేట మునిగిపోయింది.

బాగా ఈదటం చేతనైన పడవవాళ్ళు మాత్రం ఈదుకుంటూ ఒడ్డు చేరారు.

ప్రవాహం బలంగా ఉండటంవల్ల కేసటుడెక్కిన పడవ మునిగి కూడా చాలా దూరం కొట్టుకుపోయింది. కేసటుడు చావు తప్పి కన్ను లొట్టపోయి ఏదోవిధంగా ఆ పడవలో నుంచి బయటపడి ఒడ్డు చేరుకోగలిగాడు.

తనకు ముసలి బ్రాహ్మణుడు చేసిన ద్రోహం కన్నా రూపవతికి దూరం కావటం కేసటుణ్ణి చాలా బాధించింది.

ఇక్కడ పెళ్ళివారి వెంట నది దాటి కాలినడకను నడిచిపోతున్న రూపవతి ముసలి బ్రాహ్మణుడి దగ్గిరికి వెళ్ళి, వినయంగా, "ఏమండీ, మిగిలినవారంతా

కలిసి నడుస్తున్నారు, ఆయన గారు మాత్రం ఎక్కడా కనిపించరేం?'' అని అడిగింది.

''నీ భర్తేనా? ఇడుగో!'' అంటూ ముసలి బ్రాహ్మణుడు కురూపి అయిన తన కుమారుణ్ణి చూపించాడు.

రూపవతికి పట్టరాని దుఃఖమూ, ఆగ్రహమూ వచ్చాయి.

''నా భర్త ఈయనా? ఇదేదో రాజుగారినే అడిగి తేలుస్తాను!'' అన్నది రూపవతి కోపంగా.

పెళ్ళికూతురు నిజంగా అంతపనీ చేస్తే రాజుగారు తన తల తీయించేస్తారని ముసలివాడికి భయం పట్టుకుంది. అందుచేత ఆయన ఆ పిల్లను వెంటనే, తన మనుషుల చేత పుట్టింటికి పంపించేసి తనదారిన తాను వెళ్ళాడు.

రూపవతికి మాత్రం తను పుట్టిల్లు చేరానన్న సంతోషం ఏమీ లేకుండాపోయింది. ఆమె తన భర్త కోసం అహోరాత్రాలు పరితపించసాగింది. ఆయన సజీవుడో కాదో అన్న భయం కూడా ఆమెను పట్టుకున్నది దుర్మార్గుడైన వృద్ధ బ్రాహ్మణుడు తన భర్త కేమైనా కీడు కలిగించాడేమో అని ఆలోచించసాగింది.

ఈలోపుగా ప్రాణాలతో ప్రవాహంనుంచి బయటపడిన కేసటుడు, రూపవతికి జరిగిన అన్యాయం గురించి ఆమె తండ్రి అయిన రత్నదత్తుడితో చెప్పేసి, ఆ అన్యాయంలో తాను కూడా భాగం పంచుకున్నందుకు ప్రాయశ్చిత్తం చేసుకుందామని, కాలినడకను రూపవతి తండ్రి ఇల్లు చేరుకున్నాడు.

అక్కడ కేసటుడికి రూపవతి కనిపించగానే అతనికి ఎక్కడలేని ఆశ్చర్యమూ వేసింది. రూపవతికి కలిగిన ఆనందానికి మేరేలేదు. కేసటుడికి ఆ యింట అల్లుడికి జరగవలసిన మర్యాదలన్నీ జరిగాయి.

కొంతకాలం అత్తవారింట ఉండి కేసటుడు రూపవతితో సహా పాటలీపురానికి తిరిగి వెళ్ళిపోయాడు. అక్కడ చాలా కాలం వారు సుఖంగా జీవించారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



P. Balasubramanian





Pranlal K. Patel

★ పై ఫోటోలకు సరిజన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గమ్యస్థానం

రెండవ ఫోటో : అగమ్యగోచరం

పంపినవారు : కె. చెన్నారెడ్డి, బీదలబస్తీ, సీతాఫల్‌మండి. (సికందరాబాద్)

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.


చందమామ
మే 1980 సంచిక నుండి
తోకచుక్క
పాతిక సంవత్సరాలనాడు
పాఠకులనందరినీ ఆకర్షించిన
అద్భుత సాహసగాథ!
ప్రతినెలా చదవండి
మీ కాపీకై మీ ఏజెంటునడగండి.
CHITRA

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

# రామ్ శ్యామ్

## అంతరిక్ష మానవునితో స్నేహం






















